# అహింసాజ్యోతి

ఖండకావ్యముల సంపుటి

సంపాదకులు

"కరుణశ్రీ"

"ధనకుధరం"

బి. వి. హనుమంతరావు

విశ్వసాహితి

గుంటూరు

# బాపూజీ జీవితంలో - ప్రధాన ఘట్టాలు

| | | |
|---|---|---|
| 1869 | అక్టోబరు 2 | జననం |
| 1881 | | రాజకోటలో విద్యాభ్యాసం |
| 1883 | | వివాహం |
| 1888 | సెప్టెంబరు | ఉన్నతవిద్యకొరకు ఇంగ్లండుప్రయాణం |
| 1893 | ఏప్రిల్ | ఆఫ్రికా ప్రయాణము |
| 1907 | | బారిష్టరు పదవీ పరిత్యాగము |
| 1915 | మే | సబర్మతి ఆశ్రమస్థాపన |
| 1919 | సెప్టెంబరు | "నవజీవన్" పత్రికాసంపాదకత్వము |
| 1919 | అక్టోబరు | "యంగ్ ఇండియా" సంపాదకత్వము |
| 1920 | ఆగష్టు 1 | ప్రభుత్వ బిరుదత్యాగం |
| 1921 | జులై | విదేశ వస్త్ర బహిష్కారము |
| 1925 | నవంబరు | "ఆత్మకథ" రచనాప్రారంభం |
| 1933 | ఫిబ్రవరి 11 | "హరిజన" పత్రికాసంస్థాపన |
| 1946 | అక్టోబరు | నవఖాళి పర్యటన |
| 1948 | జనవరి 20 | సభలో బాంబుప్రయోగము |
| 1948 | జనవరి 30 | హత్య |

# సత్యాగ్రహాల్లో - బాపూజీ

| | | |
|---|---|---|
| 1906 | సెప్టెంబరు 11 | దక్షిణాఫ్రికాలోని జోహాన్సుబర్గులో |
| 1908 | ఆగష్టు 16 | జోహాన్సుబర్గులో |
| 1915 | | గుజరాతులోని "వీరంగంలో" |
| 1917 | ఏప్రిల్ | బీహారులోని చాంపరాణలో |
| 1917 | మే | బొంబాయిలో |
| 1918 | ఫిబ్రివరి 26 | గుజరాతులోని అహ్మదాబాదులో |
| 1918 | మార్చి | గుజరాతు కేడాలో |
| 1919 | ఏప్రిల్ 6 | రౌలత్ చట్టం సత్యాగ్రహం |
| 1920 | ఆగష్టు 1 | అహింసాయుత సహాయనిరాకరణ |
| 1924 | | తిరువాంకూరులో |
| 1927 | ఆగష్టు | మద్రాసులో |
| 1928 | ఫిబ్రవరి 12 | బార్డోలీలో |
| 1930 | మార్చి | అసహాయోద్యమం |
| 1931 | మార్చి | సిద్ధపూరులో |
| 1940 | అక్టోబరు | వ్యక్తిగత సత్యాగ్రహము |
| 1942 | ఆగష్టు | "క్విటు ఇండియా" నినాదం |

# జైల్లో - బాపూజీ

| | |
|---|---|
| 1908 జనవరి 10 | జోహాన్సుబర్గులో |
| 1908 అక్టోబరు | ప్రిటోరియాలో |
| 1913 నవంబరు 11 | దండిలో |
| 1917 ఏప్రిల్ | మోతిహారిలో |
| 1919 ఏప్రిల్ 10 | కోసిలో |
| 1922 మార్చి 10 | సబర్మతి |
| 1922 మార్చి 13 | ఎరవాడ |
| 1930 మే 30 | ఎరవాడ |
| 1932 జనవరి 4 | ఎరవాడ |
| 1933 జూలై 31 | ఎరవాడ |
| 1933 ఆగష్టు 4 | పూన |
| 1942 ఆగష్టు 9 | ఆగాఖాను |

# ఉపవాసాల్లో - బాపూజీ

| | | |
|---|---|---|
| 1913 | | ఫోనక్సు - వారంరోజులు |
| 1914 | | ఫోనక్సు - రెండువారాలు |
| 1918 | మార్చి 12 | అహ్మదాబాద్ - మూడురోజులు |
| 1919 | ఏప్రిల్ 13 | సబర్మతి - మూడురోడులు |
| 1921 | నవంబరు | బొంబాయి - ఐదురోజులు |
| 1922 | ఫిబ్రవరి | బార్డోలి - ఐదురోజులు |
| 1924 | సెప్టెంబరు 18 | ఢిల్లీ - మూడువారాలు |
| 1925 | నవంబరు 24 | సబర్మతి - వారం |
| 1932 | సెప్టెంబరు 20 | ఎరవాడ - ఒక పూట |
| 1932 | డిశంబరు 23 | ఎరవాడ - రెండురోజులు |
| 1933 | మే 8 | ఎరవాడ - మూడువారాలు |
| 1933 | ఆగస్టు 16 | ఎరవాడ - ఒకరోజు |
| 1934 | ఆగస్టు 7 | వార్ధాగంజ్ - వారం |
| 1939 | మార్చి 3 | రాజకోట - నాలుగురోజులు |
| 1943 | ఫిబ్రవరి 10 | ఆగాఖాన్ భవనం - మూడువారాలు |
| 1947 | సెప్టెంబరు 1 | కలకత్తా - మూడురోజులు |
| 1948 | జనవరి 13 | ఢిల్లీ - ఆరురోజులు |

| కవులు | పుటలు |
| --- | --- |

---

# నీరాజనం

ఆకటితో నున్న వారికి అన్నం ఎంత అవసరమో చీకటిలో నున్న వారికి వెలుగూ అంతే అవసరం. ఆకటిని అన్నం పోగొడ్తే చీకటిని వెలుగు పోగొడ్తుంది.

భూదేవి తన హృదయాన్నే అన్నంగామార్చి బిడ్డలకు అందిస్తుంది. మహాత్ముడు తన జీవితాన్నే జ్యోతిగా వెలిగించి సోదరులను ముందుకు నడిపిస్తాడు.

"అహింస" అంటే హంతకునిముందు లొంగిపోవటంగాదు. హంతకుని ఆత్మను లొంగతీసుకోటం. "అహింసాజ్యోతి" అంటే అజేయమూ, ఆదర్శమూ, అనుపమానము అయిన ఆత్మప్రకాశం అని వ్యాఖ్యానించుకొందాం.

అందుకనే ప్రపంచ శాంతి దూతను - మన భారత భాగ్య విధాతను- "అహింసాజ్యోతి"గా ఆరాధించింది విశ్వప్రజానీకం. బుద్ధభగవానుని కరుణా, క్రీస్తుప్రభువు త్యాగమూ, సోక్రటీస్ క్షమా, త్రివేణిగా రూపొందాయ్ మన బాపూజీలో. బ్రతుకే ఒత్తిగా-త్యాగమే నూనెగా-వెలిగి అనంత శాంతికాంతుల్తో దిగంతాలను ధగధగలాడించింది మన "అహింసాజ్యోతి".

ఆ జ్యోతికాంతులు గాఢాంధకారంలో కన్నులు నులుముకొనే మనకు మార్గం చూపినవి. ఆ వెలుగు బాటల్లో మనం పురోగమించాం - గమ్యస్థానం చేరుకొన్నాం - స్వతంత్రభారతాన్ని సంపాదించుకోగలిగాం.

బాపూజీ జీవితం భారతమాతకు నీరాజనం - ఆ దివ్యజ్యోతిని భారతమేకాదు-ప్రపంచమంతా కన్నుల కద్దుకుంది-బాపూజీ మనకు మరో హిమాలయం-మరో తాజమహాలు-మరో గంగానది

మనలను నడిపించిన బాపూజీ-మనలను మానవుల్ని చేసిన బాపూజీ-మనకు స్వేచ్ఛాభారతాన్ని ప్రసాదించిన బాపూజీ-నలభై కోట్ల బిడ్డలకు బాపూజీ కాగలిగిన బాపూజీ నేడు భౌతికంగా మనకు దూరమైనాడు.

గడచిన స్వాతంత్ర్య మహోత్సవాలు బాపూజీతో కలసి జరుపుకున్నాం. మళ్ళీ స్వాతంత్ర్యదినం వచ్చింది కాని మన మధ్య మన బాపూజీ లేడు. నలభైకోట్ల హృదయాలపై విచార మేఘాలు క్రమ్మే ఈనాడు ఈ "అహింసాజ్యోతి"ని ఆరాధించుకోటం ఎంతైనా అవసరం కాదా!

మా ప్రయత్నానికి సానుభూతి చూపిస్తూ చాలామంది రచయితలు తమ రచనలు పంపారు. వారందరికీ మా అభివందనాలు అర్పించుకుంటున్నాము. కొంతమంది పంపనివారుకూడా లేక పోలేదు. అందుకూ అభివందనాలు అందిస్తున్నాం. వారి స్థానంలో కొంతమంది ఉదీయమాన కవికుమారులకు అవకాశం కల్గింపగలిగి నందుకు సంతోషిస్తున్నాం.

స్థలాభావంచేత రచయితలు పంపిన పద్యాలు అన్నీ వేయ లేక పోయినాం, అందుకు క్షంతవ్యులం.

మన "అహింసాజ్యోతి" కిరణాలు సహృదయ హృదయ సరోజాలను పులకింపచేస్తాయని ఆశిస్తున్నాం.

మీ సంపాదకులు.

కనిపింపదిదియేమి? కనకకాంతులు చిందు
సత్యావతార ప్రశాంతమూర్తి!
వినిపింపదిదియేమి? వీనుల విందుగా
"రఘుపతి రాఘవ రామ" భజన!
కళ తప్పెనేమి? ఏ కాలమ్ము కళకళ
లాడుచునుండు పల్లాల మొగ!
తలవంచెనేమి? మిన్నులు ముద్దుగొను మూడు
రంగుల పెద, భారత పతాక!

తడిసినదదేమి? కన్నీటి ధారలందు
భరతజనయిత్రి ఖద్దరు పైటచెఱగు!
ఏమొ పోగొట్టుకొన్నట్టు లేదుగదేమి?
గోడుగోడున నలుబది కోట్ల ప్రజలు!!

"కరుణశ్రీ"

కనుపింపదిదియేమి? కనకకాంతులు చిందు
సత్యావతార ప్రశాంతమూర్తి!
వినిపింపదిదియేమి? వీనుల విందుగా
"రఘుపతి రాఘవ రామ" భజన!
కళతప్పెనేమి? ఏ కాలమ్ము కళకళ
లాడుచునుండు పిల్లల మోము!
తలపించెనేమి? మిన్నులు ముద్దుగొను మూడు
రంగుల పేట భారత పతాక!

తడిసినదిదేమి? కన్నీటి ధారలందు
భరతజనయిత్రి ఖద్దరు పైటచెఱగు!
ఏమి పోగొట్టుకొన్నట్టు లేదటేమి?
గోడుగోడున నలుబది కోట్ల ప్రజలు!!

"కరుణశ్రీ"

నలుబదికోట్ల భారతజనమ్ముల ప్రాణములోని ప్రాణ - మా
జలధిదిగంత విశ్రుత యశస్వి - మహాత్ముడు - మానవత్వమే
కులమని నిర్వచించిన నిగూఢకళార్థవిమండు - బాపుజీ -
బలియయిపోయె సంకుచిత భావమతాంధుల స్వార్థబుద్ధికిన్

ఇట్టి దారుణమ్మున కొడిగట్టినట్టి
దొకడె వ్వడోగాదు ద్రోహుల శతమ్ము
రూపు మాసిన ఓవొక్కరుడవె గాదు
భారతీయుల మానవత్త్వమె మహాత్మ !

"ధనకుధరం"

# అహింసా జ్యోతి

ఏరిని నొప్పజేయని అహింసశరంబుగ బూని శాంతియన్
తేపన గూడుచుండి నలుదిక్కుల రేగెడు క్రోధవహ్నిచ
ల్లారిపియార్చినీ సహనమంమన గల్గునపారశక్తిచే
భారతమాత దాస్యమును బాపితొలంగితెవీరపుంగవా!

లోకముకానదంచు తమలో పలితప్పులు వీడియొప్పులన్
యేకమువెట్టి వ్రాయుకథ లెన్నియొకల్గెనుగాని నీవలెన్
లోకులలక్ష్యపెట్టకెదలోగల భావములాత్మసాక్షిగా
వాకొనినట్టి ఆత్మకథవంటి అమూల్యకగాథలున్నవే!

అంతములేని నీహృదయ మందలి ప్రేమకు సాక్షిబాపుజీ
అంతముసందె నంచువినినంతనె యుల్లముతల్లడిల్లని
శ్రాంతము చెందినట్టి జనరాసియెఘుమ్ము మహాత్మయెందరో
ఇంతకుముందుపోరె? ఇటులేడ్చెనెలోకము దారిగానకన్?

సత్యము తప్పనట్టి ఋషిసత్తమ! నీదగుప్రేమతోటి సా
పత్యముగలునే భువిని పల్కులలో ప్రకటించునీతులన్
కృత్యములంచువీడు నపకృత్యుల ప్రేమకు ఆత్మశక్తియుం
దత్యధి కుండ వైజగతి కంతయుబంధుడ వైతివోప్రభూ!

దొప్పలపూడి అనసూయ

రత్నద్యుతులతో విరాజిల్లు మకుటముల్
తలదాల్చు చక్రవర్తులకులేదు
జపతపధ్యానముల్ విపరీతముగజేసి
యున్నట్టి మౌనివర్యులకులేదు
పలుభాషలన్నేర్చి పల్కుచుండెడు యువ
న్యాసకర్తలఘాటి యందులేదు
శిక్షణంబుగనేర్చి చేతిపరిశ్రమల్
ప్రజ్ఞగాంచిన శిల్పప్రజకులేదు
ఇన్ని పదవులలో మెప్పుగన్న నీదు
ఆత్మశక్తిని వర్ణింప నలవియగునె!
బోసినవ్వుల బాపూజీ పోల్చలేను
నీ నిరాడంబరత్వమ్ము నీకెచెల్లు

అణగియున్నది నీలోనమణులరాసి
అంతరజ్యోతితో దానినరసిపట్టి
పంచిపెట్టితివయ్య ప్రాపంచికులకు
బ్రతుకు బ్రతుకున చీకటిబాసిపోవ



# అహింసా జ్యోతి

కాఱుచీకటులలో కాంతిరేఖల గూర్చి
దారిజూపిన మహోదారజీవి
అగ్నికుండాలలో నశ్రుధారలనింపి
యెల్ల లోకమునేలు చల్లనయ్య
వడగాల్పులో శీత వాతంబు గల్పించి
హాయిజూపిన భారతీయ యోగి
హాలాహలంబులో నమృతమాధురి జొన్పి
కల్లోలమాపు దీక్షాతపస్వి
రామరాజ్య ప్రదాత - భారతవిధాత
కరుణగల శాంతిదూత - మా గాంధి తాత
ఖండ ఖండాంతరముల దుఃఖమున ముంచి
కదలి పోయెను స్వర్గలోకమునుజేర

ఇలకంపించెను దేశనాయకులు తల్లడిల్లుచు వాపోయి, మూ
ర్ఛిల్లుచున్నారు పవిత్రభారత సవిత్రీ నేత్ర దుఃఖాశ్రువుల్
సెలయేళ్లై ప్రవహించె శాంతగుణరాశీ! ఖండఖండాంతరం
బులు ఘోషిల్లె భవద్వియోగ విషయంబున్విన్న మాత్రంబునన్

కన్నెకంటి వీరభద్రాచార్యులు

వ్రాలిపోయినవి జెండాలు మాదేశాన
నాకలోకమునం బతాకలెగిరె
వినిపించెరోదనధ్వనులు మా రాజ్యాన
హర్షధ్వనులు స్వర్గమందు మ్రోగె
క్రమ్ముకొన్నది యంధకారంబు మా వీట
దివినిండ పూర్ణచంద్రికలు వెలసె
అల్లాడుచుండె జవ్హారులాలు మాభూమి
సంతసించెను వజ్ర స్వస్తలమున
భారతసవిత్రి గుండె గుభాలుమనియె
స్వర్గరాజ్యేందిరకు మహోత్సాహముమరె
భారతీయులు దౌర్భాగ్యపరులు-సురలు
ధన్యచరితులు తాత! ఈ తరుణమందు

అమరుల్ నీయిరుప్రక్కలన్ నడువ దివ్యధ్వానముల్ మ్రోగగా
రమణుల్ హారతులిచ్చి సన్నుతులొనర్పన్ బాలగంగాధర
ప్రముఖుల్ దీవెనలీయ అవ్యయము జేరంబోవు నీపాద ప
ద్మములన్దాకి పవిత్రమైనవి మహాత్మా! స్వర్గసోపానముల్

* * * *

తుచ్ఛుడెవండో మచ్ఛరముతో నినుగూల్చి పవిత్రజాతికే
మచ్చవిధించె - నియ్యది అమానుషకృత్యము - లోకమందుహా!
వచ్చెనుమాకునేడుతలవంపులు - చచ్చినదీవుకాదు జీ
వచ్ఛవరూపముల్ పతితపావన! మాయవినిక్కువంబుగన్

హలమహారాష్ట్రము - గిత్తలావిమలసత్యాహింసలే ప్రొద్దు - నీ
పాలమహాభారతభూమి - విత్తనములభ్యుత్థానసందేశముల్
ఫలమాదాస్యవిముక్తి - సత్వరమనఃస్వాతంత్ర్యముల్ - కర్షకో
జ్జ్వలచారిత్రమునీయదే మధురభావా! ఎంతధన్యుండవో?

వెలవెలబోవ భారతసవిత్రినిదాచిబిగించినట్టి ఆ
తలుపులు నీమహత్తున బదాబదలైనవి ఘోరయుద్ధమున్
సలుపక ధైర్యమున్ విడక శాంతిరణంబున నూలుపోగుతో
కలపరపెట్టినావు నవఖండములేలెడి చక్రవర్తులన్

హాయిగవిశ్రమింపుము మహాత్మ! సురాలయసీమలన్ మన
స్థాయివహించి నీకికవిచారముతోబనిలేదు నీయభి
ప్రాయమదేదొ దానినిలుపంగలవార మిదేప్రతిజ్ఞ గాం
ధేయులమై చరాచరవిధేయులమై మనినంతకాలమున్

   

# అహింసా జ్యోతి

అచితలపోయరాని హృదయప్రవిదారి విషాదవాచ్యకా
స్పదముపంచఖండములుబావృయమన్న పిశాచివేళ - ము
ప్పదిపడికోట్ల భారత తపస్సముదాయము భస్మరాశియై
చిదికిన ఘోరదుర్దినమిదీ! పచియింపగ జిహ్వరాదునే

ఉపవాసంబుపసంహరించుకొని యెన్నోనాళ్లుకాలేసు తా
నుపలాలించు ప్రపంచశాంతిరమ కాయుర్భ్యాతిసిద్ధింప లే
ద పరాహ్ణంబున గ్రుంకెనే భరతము న్యాదిత్యబింబంబు పూ
ర్వపుఖండంబున సస్వాభావికముగా రోదస్సు రోదింపగన్

అదిగో రాష్ట్రముచేత దేశజుల కాహారంబు గల్పించి అ
భ్యుదయోపాదక సామరస్యమున కాయుర్దాయమున్ బోసి ఆ
పదపాలై మరణించి భస్మచయమున్ భాగించి దేశాలపై
వెదజల్లించిన గాంధితాతఋణమున్ విశ్వంబెటుల్ తీర్చునో!

ఆటంబాంబులవారు దద్దరిలి రాజ్యత్యాగమున్ జేయు ము
ప్పూటల్ పస్తులుజేసి చిక్కిన మహాత్మున్ జీర్ణకంకాళమున్
వేటాడించిన క్రూరురాలవకటా! నీకా స్వరాజ్యంబు నీ
చేతే శాశ్వతదాస్యమున్ మరల వ్రాసెన్ బ్రహ్మ ఢిల్లీపురీ!

జి. జాషువ

ఘోషాలోపడి కుళ్ళిపోయినది దిక్కున్ మ్రొక్కు లేకుండ మీ
ఘోషాపుండలి యెండకన్నెరుగకీ యుత్కృష్ట ధర్మాలకున్
ఘోషాలంబయి బూజుబట్టినది హిందూజాతి చిత్తంబునం
దీషత్ప్రేమనుపెంచి స్వేచ్ఛనిడవోయీ ! యక్కసెల్లెండ్రకున్

అయ్యలు మియ్యలుంగలిసి అన్నలుదమ్ములటుల్ మెలంగినన్
కయ్యములుండ విశ్వజనిగర్భమునం జనియించి మానవుల్
నెయ్యమువప్పి భిన్నమతనిష్ఠలతో కలహించుచుండినన్
వెయ్యియుగాలదాస్యము వినిశ్చయమీ రతనాలభూమికిన్

గోచియు గొంగడిన్ గలిగి కొట్టక తిట్టక భారతక్షితిన్
గెలిపగిట్టుటో నడుపు నేర్పరి - కన్నుల ప్రేమచంద్రికల్
పూచి ఫలించునిశ్చలుడు మ్రొక్కిన తక్కిన పామరన్యమున్
తూచియొసంగు నీశ్వరుని దూతకడన్ పగనూపిరాడునే ?

ప్రేమస్వర్గము సృష్టిజేసినయెన్ క్రీస్తుండు మున్నిందియా
భూమిన్-బుద్ధుడహింసనాటి చనెమాసూదుండు హింసాక్రియా
వైముఖ్యంబువిధించె-వర్గకలహవ్యాధిన్నివారింప నిం
కే మందుల్ పనిసేయు? శాంతి చనిపోయెన్ ఖాయిలాపడ్డదై

* * * *

అవతరించిన స్వరాజ్యసామ్రాజ్యబాలిక
కక్కటా ! ముకుపచ్చలారలేదు
సకుటుంబముగవీడి చనుచున్న పరరాజు
నిజసీమలో కాలు నిలుపలేదు
హస్తినాపురిమీద హైందవధ్వజమెత్తి
నిండుగా యేడాది నిండ లేదు
స్వాతంత్ర్యఘనమహోత్సవధ్వానంబు
మార్మ్రోత లూరూర మాయ లేదు
సింహపీఠిక నధివసించిన యనుంగు
మనుమలన్ చూచుకొనుచు అమందహర్ష
పులకితస్వాంతుడగు దొడ్డముసలివాడు
మాయమయ్యెనే! లోకాల గాయమగుచు

అంటరానివారి యంతరంగంబున
పేలు అగ్నిపర్వతాల ఘోష
అంటరానివాడవై ఆఫ్రికాయందు
తెల్లవారి నడుమ తెలుసుకొంటి

   

# అహింసా జ్యోతి

కారుచీకట్లు గ్రమ్మె నాక్రందనములు
ఖండఖండాంతరమ్ముల గ్రందు కొనియె
స్తంభితంబయ్యె సాధుచేతఃప్రవృత్తి
అల మహాత్మమహాజ్యోతి మలగి పోవ

సీమసింహాలు నౌఖాళీ చిఱుతపులులు
నీదు తత్త్వంబు నెఱిగి మన్నించె గాని
ఎఱుగలేదయ్యె నీచహైందవుడె నిన్ను
కాల్చి మ్రందించె నతడెంత ఘాతుకుండొ !

సలిపె దృఢదీక్షతో నహింసా వ్రతంబు
అపర బుద్ధుడు గాంధీమహాత్ము డట్టి
బాపుజీ నాహరించె హింసా పిశాచి
ఇట్టి విపరీత ఘటనకు హేతు వేమొ ?

తూర్పు పడమర లైన హిందూ మహమ్మ
దీయులకు నైక్యమేమి ? సాధించు టేమి ?
కాని పని బూని నిష్కామ కర్మ యోగి !
బలి యొనర్చితె బంగారు ప[illegible] !

దీపాల పిచ్చయ్య శాస్త్రి

కడగండ్లమారి చీకటి బందిఖానలే
రమణీయ భర్మ హర్మ్యములు గాగ
ఓకిలింతలుతెచ్చు తూకంపు మెతుకులే
షడ్రసోపేత భోజనము గాగ
క్రూరభటాళి కఠోరగర్జనములే
యాప్త సల్లాప వాక్యములు గాగ
కృపణాధికారి నిర్దిష్ట కర్మంబులే
యాత్మీయ నిత్య కృత్యములు గాగ

తమ్ములకు తాపులకు గూడ తాళి తాళి
తెచ్చికొన్న స్వరాజ్యంబు తివిరి యనుభ
వించు వేళకు నిటు ముప్పు ముంచు కొనియె
భారతీయుల గాథ దౌర్భాగ్య మేమొ!

ఇకనైన మేలుకొని తా
త్త్వికదృష్టింబొరసి భావభేదములుడివో
నొకత్రాటు నడచి నీయా
త్మకు శాంతిం గూర్చు గావుతన్ బ్రజయెల్లన్

   

# అహింసా జ్యోతి

ఏమని విస్మయింపగల నేవిధి వ్రాయగ నేర్తు నయ్యయో!
మామక మాతృకంఠ మణిమండనమై విలసిల్లు నాయక
గ్రామణి గాంధిదేవు నవకౌముది జిందెడి కర్మచంద్రు సో
మ్యాముల రమ్యరమ్య ధవళాంశు మణిన్ గడముట్ట జేసితే?

కరుణ యొకింతలేక మనగాంధిమహాత్ముని హత్యకై భవ
త్క్రరములెటుల్ గడింగెనొ? అకారణ పాపదవానలమ్మెటుల్
శిరమునదాల్చితీవకట! చిత్తము సంభ్రమమందె నేమొ శ్రీ
హరియపరావతారముని యార్యులనన్ విననేరవైతివే?

చింతలేముగా భవదీయ చిత్తమందు
హింస గావించుటే నీకు హితపదేమొ?
కఠిన పాషాణ తల మృత్తికలను నిన్ను
చిత్ర సృజనమ్ము సల్పిన శిల్పి యెవడొ?

ఆమహనీయమూర్తి కరుణాలయరోచిరుదంచితప్రభా
రామకమై ధరాస్థలి నిరామయవృత్తి ఘటించ శాంతి భ
ద్రాములచంద్రికామధుసుధారస వాహినియందుగాక త్వ
త్కామిత మెట్లుగాంచితివొ? గాంధిమహాత్ముని రక్తధారలన్

షేకు మీరా మొహియుద్దీన్

# అహింసా జ్యోతి

నిఖిల మతములు తంత్రులై నిస్వనింప
మేల్మి గీతా విపంచిక మేళవించి
సత్య గానామృతముజిందు సాధు ఋషికి
హత్య కాబోలు ! హైంసవు లంపు కాన్క

గాంధి దేవుని మరణ సంఘటన మనెడు
బాంబు వ్రేటున చుక్కాని బద్దలయ్యె
నట్టి నడియేట భారత నౌక కిపుడు
దారి జూపించు దిక్సూచి జారి పోయె

యమున తీరాన గుంపులై కుములు ప్రజల
వేడి కన్నీటి యూటల వెల్లువలకు
ఆరిపోక గంధపు జెక్క లారగించి
గోఘృతము త్రావి నాల్కలు గోయు చున్న
మంటలోనిన్ను గుప్పెడు మసి యొనర్చి
అఖిల నేతను వలకాటి కప్ప జెప్పి
చిన్న బోయిన న్యూఢిల్లి తెన్ను జూడ
కాళ్లు రావింటి వంకకు కన్న తండ్రి !

మూల కొండారెడ్డి

# అహింసా జ్యోతి

అస్తమించినది నేడా సేతుహిమశైల
దేదీప్యమానమౌ దివ్యతార
భగ్గుమన్నది నేడు భారతజనస్ఫూర్తి
కనిపెంచుకొన్న బంగారుపంట
పెడిసి గల్లున క్రుంచబడిన దుర్వాకాంత
కలికిపాపటమీద కనకభూష
మూగవోయినది భూభువన భర్తకరాన
నినదించు శాంతి మాణిక్యవీణ

మనుజకోటికి మకుటాయమానుడవయి
దేశమున నవ్యచైతన్య దీప మిడిన
పుణ్యు నిను చేతులార గోల్పోవు కతన
పూర్ణ రాజర్షి! యీలోటు పూడ్చుటెట్లు?

రాజవుకావు నీవు పలురాజులు నీచరణాల దాపునన్
పూజలొనర్చినారు అనిబూనిన యోధుడవీవు కావు పో
రాజిని నీకు మించిన పరాక్రమవంతుడు లేడు చిత్రమై
రాజిలు నీచరిత్రకు జరామరణంబులు లేవు బాపుజీ!

* * * *

స్వేచ్ఛానుకూలంబు చిన్నిబిడ్డలకిచ్చి
మొలదాల్చితివి నీవు ముతుక పంచె
అధికారదండంబు ననహాయుల కొసంగి
యూతగొంటివి నీవు చేతికఱ్ఱ
ఆనందపాయస మందరకును బంచి
కావించితివి నీవు కటిక పస్తు
అరుణపురపు మార్గమును యోధులకు జూపి
కోరుకొంటివి నీవు పూరియిల్లు

అట్టి త్యాగమూర్తి నాత్మబంధుని నిన్ను
కాల్వ దాటి తెప్ప గాల్చి నటులు
ఖూని జేసి పాపుకోరాని పాపంబు
పులుము కొనియె భరత భూమి యిపుడు

కొండవగు నిన్ను బ్రతికించుకొనగ లేక
శవమునకు నింత విభవమ్ము జరిపి నాము
వెఱ్ఱి పుత్త్రులటంచు భావింతు వేమొ
భక్తి మము నిట్లొనర్చె నో పరమ పురుష !



# అహింసా జ్యోతి

ఒకతృటిలో ప్రపంచ మటుమాగిన - దొక్కకయప్రు పట్టిగా
ప్రకృతి దహించి యేడ్చినది - ప్రత్యణు వాత డనంతకోటరా
పకుడని దోయిలించినది - బ్రహ్మపదార్థములోన లీనమై
పకపకలాడు మాభువన బాంధవు డింకిటు తొంగిచూచునా?

నలుబదికోట్ల బిడ్డల మనఃపరివర్తనకై తపించినం
దుల కిదియాఫలంబు మనఘుష్కృత మాశశితారకమ్ముగా
నిలుపకతప్ప దీభువననిందకు పాత్రముగాక తప్ప దా
ఖలునికతమ్మునన్ భరతఖండ చరిత్రమె తారుమారగా

చలమునన్ శౌర్యము తెరిజూడని అహింసాఖడ్గమున్ దూసి మా
ణుల నొక్కెత్తున నీడుద్రాపిన భవన్మూర్తి ప్రభూత ప్రభో
జ్జ్వలమాహాత్మ్యవశంవదమ్ములయి రక్షఃక్రౌర్య కౌటిల్యసం
కుల సామ్రాజ్యము లిచ్చమెచ్చినవి నీకవాలంకష ప్రజ్ఞకున్

ఒక సూత్రోపగున ఆంగ్లరాజ్యవిభవ మ్ముఱ్ఱూతలూగించి అం
తెను రాబట్టితి వంతవారల త్రిలోకీపూజ్యమౌ నీచరి
త్రకు దిగ్వ్యాప్తహములే సమున్నతులొసర్పన్ స్వీయ దేశీయు లీ
ర్ష్యకు లోనై తెగటార్చి రాత్మహననవ్యాపార పారీణులై

ఏటుకూరి వెంకటనరసయ్య

తమమాత్రమ్ము గ్రహింపడా స్వమత విధ్వంసంబు నింద్యంబు తా
మమతాద్వేషము లుజ్జగింపుడనియెన్ మర్యాదవాటింపుచున్
సమతాసూత్రము లన్వయింపుడనియెన్ స్వాతంత్ర్యసంలబ్ది క
ర్థము ప్రాణమ్ములు ధారవోయుడనియెన్ తద్దృష్టి సామాన్యమా

కాలకిరాతకా! యుగయుగమ్ములు మారిన నారిపోవ వీ
జ్వాల లఖండ భారత తపఃఫల దివ్యరసానుభూతు లీ
గాలిబయళ్లు సూరి కలకాలము వారల దన్ను నింత కీ
కాలమువారు ధన్యులని కాగల నంతతు లాడిపాడవే

తమకై గాంధిమహాత్ముడై ములుచు వాతన్బడ్డ చంద్రమ్ము ము
స్లిములోకమ్ము గ్రహించియుండు నిక దృష్టిన్మార్చి బాపూజి సూ
త్రము లాత్మన్ మననంబొనర్చిన తదాత్మజ్యోతి శాంతించు స్వ
ర్గముగామారి సమిష్టిభారతమమోఘంబై ప్రవర్తిల్లదా

ప్రేమకహింస శాంతి ముడివెట్టిన బుద్ధుడు క్రీస్తు సోక్రటి
సే మహితార్థమై అసువు లిగిరొ? తత్ప్రతిబింబమైన మా
ప్రేమతపస్వి నేడు కనుపింపడుగాని తదీయదివ్యబో
ధామృతపానమత్త మఖిలావనితన్మున్మరించు నిచ్చలున్

*  *  *  *

# అహింసా జ్యోతి

ఆరిపోయిన దానియాజ్యోతి ఏవెల్గు
లీచీకటుల కెదురీద గలవు?
సడలిపోయిన యహింసాసూత్ర మేదయా
మహిమ హింసాకాండ మాన్ప గలదు?
భగ్నమైన యపూర్వధర్మదేవత మరే
న్యాయము మీలోకంబు నడుప గలదు?
తరలిపోయినది సత్యస్ఫూర్తి ఏనీతి
నిష్ఠ లాశాంతిని నిలుప గలవు?
సార్వకాలిక సమధికాచారసార
మీమహాత్ము డుదాత్మలందే లగించి
అజర మమర మనిర్వాచ్య మగుచు నగుచు
విశ్వకల్యాణి కిరణమై వెలయు గాక

పూలరథమ్ముపై కదలి పోవు మహాత్ముని వెంట. రెండుమూ
నాళుల కెందరో తరలి నారిక మేము తదీయనామరూ
పాలు స్మరింప నిల్చితిమి భారత పుణ్యనదీనదమ్ములా
పాలవిభూతిపై నొలసి పావనమైన వొకింతమాత్రలో



# అహింసా జ్యోతి

నివాక్యామృత శీతధారగలిసెన్ నీహారధారళి వి
ద్యావైదగ్ధ్యములందు బారిన వసంతంబైన సంధ్యమ్ము నీ
దౌ వర్షప్లవ లీనమైనది యశాంతజ్యోతి గాంధీమహా
త్మా! వల్లించెడిభూనభోంతర దిగంతంబుల్ భవన్నామమే

తీరులుపొందిసౌరభము తేఱ మొయిం గయిసేసి ఆత్మజి
స్వైరవిలోకవప్రభలు పండిన వెన్నెల తీవలట్లుగా
స్వైరవిహారసంపదలు పట్టెను భారతకాంత నిన్న నే
వీడము చాళ్లు చెక్కిళుల వించితి వింతనెఏమయా ప్రభూ!

భారతీయ స్వరాజ్య సంపాద నమున
ముప్ప దెలియక స్వోహ్యాల మునకె పెరుగు
కదళికా భూరుహ మవైతి గాంధి నేడు
ఎంత బలిగోరె! స్వాతంత్ర్యకాంత దేవ!

సంద్రములు దాటి ఏఱులు చక్క గడచి
కాల్వ లీదియు నిలుముందు కాల్వ బడితి
జగ దుపాధ్యాయకుండ వంచు వగతు గాని
జన్మ చరితార్థ మోగాంధి! సార్వభౌమ!

పువ్వాడ శేషగిరిరావు

రోగమున జీకి చిక్కి మొత్తో యటంచు
ఘంచమున జత్తురీ యనామక జగమ్ము
గాంధిజీ ! భవాదృశ మృత్యు కథయె వేరు
పత్రై మృతజీవివ్యజీవచ్ఛవాలు !

కృష్ణు డెటులేగె న్క్రీస్తు మృతియు నెటుల
అరిగి రెటు సోక్రటీసు మహమ్మదులును
ఆత్మ బలి తప్ప నవతార మందు నేది
పడయు నోతురె మిమ్ము నిర్భాగ్య జనము

తిలకు కలగనె దాసు శోషిలుచు బోయె
లాలజీ ప్రాణమిచ్చె స్వేచ్ఛా లతాంగి
అదిగొ యిదిగోయనంగ బోసరిగె నీవు
ధన్యుడవు స్వేచ్ఛ జూచియే తరలి నావు

జననికై ఆత్మరక్త మాంసమ్ము లొడ్డి
తుదకు బలియైన వీరుడా ! దుఃఖబాష్ప
సింధువున దోగు మా సుహార్ప్ప చెమ్మ లెల్ల
యుష్మదాత్మను శాంతితో నోల లార్చు

   

# అహింసా జ్యోతి

సత్య మహింస ఉచ్ఛ్వాస నిశ్వాసముల్
సల్పి జీవించెడి సత్యమూర్తి!
విశ్వకల్యాణ గవేషణా పథమందు
పయనించు ఒంటరి బాట సారి
సత్యాగ్రహమ్ముచే శాత్రవులను శిష్య
నిర్విశేషుల జేయు నిగమ రాశి
రాట్నము ధర్మచక్రముజేసి పరిశుద్ధ
ఖద్దరు నిర్మించు కర్మయోగి!
బుద్ధదేవుడు పుట్టిన పుణ్యభూమి
నేటికిని పునఃపూతమై నెగడు నట్లు
అవతరించిన యట్టి ఓ అమృత మూర్తి!
అందుకొనవయ్య మాస్వాగ తార్థ్య ములను

కారణజన్మమెత్తి చరఖా భుజసీమను మోసి తెచ్చి మా
భారతభూమిపై నిలుపవచ్చిన దివ్యమహర్షి! విశ్వసం
సారములో అహింసకయి సత్యము కోసము దీనమానవో
ద్ధారణకై తపస్సులు సదా వెలయింపు మజాతశాత్రవా!

నండూరి కృష్ణమాచార్య

సేవాధర్మము మానవాకృతిని దాల్చెన్ నీ స్వరూపమ్మునన్
సేవాగ్రామ తపోవనిన్ నవనవోన్మేషమ్ము గల్పించు - దీ
క్షాపత్రమ్ములనేయు రాట్నముల ఝుంకారమ్ములన్, నీ అహిం
సావాదమ్ములు, శాంతిదీపకళికల్, స్వాతంత్ర్యశంఖధ్వనుల్

బుద్ధు డహింసచే భరత భూమిని క్రీస్తుకు పూర్వమందు ధ
ర్మోద్ధరణమ్మొనర్చెను శుభోదయ మయ్యెను; దాస్యశృంఖలా
బద్ధులు భారతీయుల తపస్సులు పండె స్వతంత్ర మంత్ర సం
శుద్ధులు శాంతి సత్య రణశూరులుపట్టిరి నీపతాకమున్

ఇది రవి అస్తమింపని మహీస్థలి నంతయు నేలువారితో
ఎదురుగ నిల్చి డీకొనుట ఎంతటి సాహసమయ్యొ!! వీరులై
కదనము చేయుగా దగిన కత్తి గటారులు లేక దాసులై
ఒదిగి అణంగిపోయి పడియుండిరి ఇంతకు ముందరెందరో

పరము గంభీర మంచు నీ వాక్యములకు
భాష్యకారులు గ్రంథాలు వ్రాసినారు;
కాని ! - ముగ్ధమోహనము నీ మౌనమునకు
భాష్యమొనరింప గల్గిన వారు లేరు !!!

* * * *

# అహింసా జ్యోతి

పూసిన మల్లెపూ తొలుక బోయుచు చల్లని చూపుతో ఉప
వ్యాస సుధామధూక్తు లిడ అంజలి పట్టును గాని నీ నిధి
ధ్యాసకు తల్లడిల్లు జగమంతయు అర్థమెరుంగలేక - నీ
బోసి మొగమ్ము విప్పుము ప్రభూ! చిరువెన్నెల పోవజల్లులన్

నీ పదుగుమోపిన చవిటి నేల లైన
తీర్థ భూమియౌను భరత దేశమందు;
నీవు పల్కిన పలుకులు నిగము భాష.
యగుచు విపదించుచుండు మహానుభావ!

ఆటము బాంబు విశ్వ విలయమ్ము ఘటించెడి తీవ్ర దౌర్క్య ఆ
రాటము చెందుచున్నది ధరాస్థలి యంతయు ధర్మసూత్రముల్
రాటము మీద త్రిప్పి అనురాగతరంగిత మైన వేడి క
ప్పిటని. గార్చి మమ్ము కరుణించితి విశ్వజనీనజీవనా!

'గాంధిమహాత్మ' దివ్యపదకంజము లంట జనావళుల్ జగద్
బాంధవ! తీర్థ యాత్ర కయి వచ్చిరి; తెమ్మిక ఊతకోలతో
బంధములో కృశింపదిక భారతమాత; స్వతంత్రగీతికా
బంధురమైన దుందుభి రవంబులు వింపుము బోసినోటితో?

   

# అహింసా జ్యోతి

చేతన మచేతనముగ అచేతనమ్ము
చేతనమ్ముగ మారె విచిత్ర మౌర!
బాపుజీ! ఒకద్రోహి తుపాకి దెబ్బ
నిన్ను హతమార్చె నని విన్న నిముస మందు

సకల మతములు నీముందు సాగి మొక్క
సత్యము అహింసయును నీకు సహకరింప
బోసి చిరునవ్వు వెన్నెలల్ ముంచ మమ్ము
మోహపెట్టు నెవండిక ముందు బాపు!

నీదు నాయకత్వమ్ముచే నేటి కింత
స్వేచ్ఛ లభియించె ననుచు అశేష భార
తమ్ము సంతోష మంద క్షణమ్ము లోన
వెడలి నాడవె మమ్ముల వీడి నొంటి!

శాంతి బోధించు క్రీస్తును చంపి నారు
నడిబజారున సిలువపైనను బిగించి
విషముచే సోక్రటీసు చంపించినారు
నీతి లేదేమి? మానవజాతి కసలు

అమ్మాజీ

# అహింసా జ్యోతి

కరములు దోయిలించుచు జగజ్జను లెల్లరు సఖ్య మిచ్చి ఆ
దరమున లోకబంధువని దండము బెట్టగ సత్పథస్థితిన్
ధరణి బవిత్రమున్ సలిపి ధర్మపథమ్మున నిల్పి లోకమున్;
మఱుగయి పోతిరొక్కొ ? ఒకమారె మహాత్ముడ ! నీవు - సూర్యుడున్

పొరిపొరి అంబరంబున నభోమణి వెల్గెడు గాక; ఆనిశా
కరుడును రేల వెన్నెలల గాయుత; భారతభాగ్యదేవతా
వరుడవు నీవు లేమి; గుణవారిధి ! జీవిత మంధకారబం
ధురమయి పోయె; త్వద్విరహ దుఃఖము లోకమెటుల్ భరించునో ?

కడుకొని ప్రాణదాత లటు గన్పడుచున్ ప్రతిబంధకంబు లె
ప్పుడునెవొ సల్పుచున్ పొరుగు పోరులు పెచ్చుచు దుండగంబు లే
ర్పడ గడముట్ట జేసితిరె ! భారత దేశమణిప్రదీపమున్
పడమటి గాడ్పులార ! ఇదిపాయనిపాపము నప్వబోకుడీ !

అకుటిల చారువృత్త మనహంకృతి పాత్రము మాతృదేశపూ
జక సహకారి నాయకము సత్యదయా నయశాంతి దాంతి బో
ధకము స్వరాజ్యలాభ సముదాత్త మహింసము గాంధి ముఖ్య నా
యకము విషాదనాటక మహా ! ముగిసెన్ భరతోక్తి శూన్యమై

పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు

# అహింసా జ్యోతి

ఆ పాతాళము త్రవ్వ సాగరులు యజ్ఞాశ్వార్థ మాగుంటకున్
వ్యాపించెన్ సుయశంబు సాగరముగా బాపూజి! త్వత్పుణ్యపున్
బ్రాపున్ గాంచనివారు త్వద్విరట త్వత్పాదస్థలిన్ మృత్స్నకై
కూపంబో! యదిపుణ్యవాపియొ! మహాకాసారమో కాదొకో!

రతనంబున్ జెయిజార్చికొంటి విక నూరా? పేరా? నీకయ్యో భా
రతమా! నిశ్శరణంబవైతివి పదార్థంబా! వృథాసూనృత
వ్రతమా! నీబ్రతుకింక సద్గుణములారా! మీరునిష్కాసితుల్
శతవర్షంబులు నీకునిండెనే యహింసా! హింస! కాలూనితే?

శాంతుని శాంతిదూతయని సర్వజనంబులు మెప్పుగన్నధీ
మంతుని జక్రవర్తికరమూనితు నార్యు నహింసనైక సి
ద్ధాంతుని దాంతునిన్ భరతదాస్యహరున్ బలిమార్చితక్కటా!
ఇంతటి ఘాతుకత్వమున కెట్లొడిగట్టితివోయిసోదరా!

కాలుచుండ దాను చందన కాష్ఠములను
గుండెలో దాగిన తుపాకి గుండుగాచె
శ్రమగుచోట నుంచెపై బాయునపుడు
ఆశ్రితుల విడలేరు మహాత్ములెపుడు



# అహింసా జ్యోతి

జోహారులు బాపూజీ!
స్నేహామృత శిశిరసారణీస్మితరోచి
స్సౌహార్దమధురమూర్తీ!
ఊహాశేషుండవైతివే మాతండ్రీ!

ఒకచూపు చాలులే సకలప్రజాకోటి
చిత్తసీమల శాంతి చిలుకరింప
ఒకమాట చాలదే ఉద్రిక్తసోదరా
ళుల తేర్చి సుప్రసన్నులను జేయ
ఒకవార్త చాలుపో ఉర్వీధరుల రాజ
ముద్రికలకు మార్గములను జూప
ఒకదీక్ష చాలు ఊరక లోకములు లోక
ములు తల్లడిలి పదమ్ములను మ్రొగ్గ
అతడు నిస్స్వార్థ బుద్ధి సత్యాగ్రహుండు
అఖిల మతము లతనివె దాస్యాంధ కార
బంధురాకాశ వీథి నవ్య స్వాతంత్ర
సుప్రభాత విధాత యుగ ప్రవక్త

బొడ్డు బాపిరాజు

కంసుడా? రావణాసురుడా? కాక జగత్ప్రియ శాంతిదూత వి
ధ్వంసము సేయగా ప్రతిన పట్టునటే? "మతపిచ్చి" బాపుజీ
హింసకు దారితీసినదా? ఈకలకాలపుమచ్చ స్వర్ణదీ
హంసికవంటి మావిమల హైందవజాతి ముఖాన పుల్మెనా?

నడపెన్ రక్తపుబొట్టు క్రిందపడకుండన్ శాంతిసంగ్రామమున్
బడుగై దాస్యము చేయు మాతృజగతిన్ పండించె స్వాతంత్ర్య మె
వ్వడు మా తండ్రి మహాతపస్వి చిరసేవా సత్ఫలంబందెనా
కడకీ భారతభూమి ఎంతటి అపఖ్యాతిన్ వలందాల్చెరా!

భారతవర్ష మొక్క అవిభక్తకుటుంబము - నిన్న మొన్న చే
కూరిన స్వేచ్ఛకే కనులు గ్రుట్టి పరస్పర మన్నదమ్ములన్
పోరుసు పొక్కు పుట్టినది - పోయినటే ఒక పెద్దదిక్కుగా
తిరుచు తండ్రి ఎట్లుకడతేరునొ? రావుల కాపురంబికన్

తరతరముల్ నుతించు జగదద్భుతమైన అహింసతో మహా
త్తరవిజయమ్ము తెచ్చిన విధానము భారతజాతి శౌర్యమున్ -
తరతరముల్ శపించు ప్రియుదర్మనుడై హితమెంచు తండ్రినిన్
పొరిగొను టన్న ఊహ ఉదిపుట్టిన భారతజాతి క్రౌర్యమున్

* * * *

నీవైకోరిన చావు వచ్చినది తండ్రీ! దుర్గరాభారపు
గ్భావంబించుకలేని వీరజనయోగ్యంబైన దేరాజకీ
యావేశంబులు అంటినట్టి శుభసాయంప్రార్థనావేళ అ
శ్రీ వేసిముఖమం దహో సుకృతమూర్తీ ! ఏతపస్సిద్ధమై

స్వేచ్ఛాలోభ పరస్పరాసహన దుర్హింసా మతద్వేష దో
షచ్ఛాయాఖని భారతావని ప్రతిష్ఠాపింపగా సర్వలో
కోచ్ఛ్రంబౌ ఒకరామరాజ్యమును నీవూహించితే తండ్రి ఈ
తుచ్ఛస్వార్థమతప్రమత్తులకు లేదో ? ఆమహాదృష్టమే !

మలయున్ సాంధ్యమహత్తరంగములలో మాతండ్రి ప్రాణానిల
మ్ముల్, శేషాస్థిపుఁజమ్ము పావననదీ పుణ్యోదకశ్రేణి ఘూ
తలరేణువ్రజమందు, మా జనకు రక్తచ్ఛాయ లాధర్మబో
ధలు మాడెందములందు నిత్యమును ప్రత్యక్షమ్ములై వెల్గుతన్

ఒక్క దీపమ్ము తాను కొండెక్కినంత
నేడు నలుబదికోట్ల గుండెలను కూడ
వెలుగుచున్నది శాంతి నిశ్చలపు కాంతి
ఏతుఫానులు ఆర్పలేవింక దీని

   

# అహింసా జ్యోతి

ఒకజీర్ణించిన వ్యక్తి చంపబడగా నుద్విగ్నులై యెట్టి రీ
తికి లోనై యెటులుందురో తదనుభూతిం బట్టి ఈ నాడు వే
నకు వేల్ ప్రాయమువారు చంపబడుచుండన్ చూచి యెట్లుంటిరో
ఇక గన్పించు డటంచు గాంధి హతుడయ్యెన్ గాక వేరున్నదే?

స్తపనీయంబుగ చెప్పుకోదగిన శ్రద్ధా భక్తి విశ్వాసముల్
మిపులన్ గన్పడ తా దలంచినయటుల్ నిర్మాణ కార్యక్రమం
బు విశేషంబుగ వ్యాప్తిసేయగనె మహాత్ముం డేగినట్లున్న దెం
టవు నేనిన్ మరి తత్పరోక్షమున నే యాయత్నముల్ దేనికౌ

అనుమానింపక సోరువాగెదుగదా అయెవ్యా మహాత్ముండు గో
వును గాల్పింపుటచేతనో కులములన్ పోగొట్టగానో సనా
తన ధర్మంబును పాడుసేయుటనో? తత్తత్పాపమే తన్నుగా
ల్చిన యట్లాడుదు రేమిలోకము యిసీ చీకొట్టినన్ జాలదే?

అరరే! యెంతటిమూర్ఖలోకముగదా అస్పృశ్యులంజేర్చి నం
కరముం గూర్చి పవిత్రమౌ గుడుల మాంగల్యంబు గావింప త
ద్దురితారిష్టమె కొట్టి చచ్చెను మహాత్ముండటందు రయ్యయ్యొ ఎ
వ్వరినోర్మూయుదు మెంత పాపపుకలి ప్రాబల్యమో చూడుడా!

మద్దులపల్లి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

తన మహోవైశాల్యమును చెప్పకయె చెప్ప
వెడద కన్నుందోయి బెడగు తోడ
తనతత్త్వ విజ్ఞాన తత్పరత్వము దెల్పు
సదమల బ్రహ్మ తేజంబు తోడ
తన దీన మానవోద్ధరణేచ్ఛ సూచించు
కుసరైన కొల్లాయి గుడ్డ తోడ
తన అహింసామార్గమును ప్రతిష్ఠాపించు
శ్రుతిమనోహర వచో వితతి తోడ
పూర్వహైందవ భూమి భృద్భూమి విజయ
నివహ సంపాద నోద్యోగ నిత్య హేతు
భద్ర మత్తేభ గమన శోభనత తోడ
నాత డెచటనో నడుచు చున్నట్లు తోచు

అంతరిక్ష తలంబున అఖిల లోక
దుఃఖ పిశునమ్ము తోచెను తోకచుక్క
భూతలమునుండి నిఖిల భూ భువన పుణ్య
ఫలమెగిరిపోయె ఒక్క దివ్యంపుజుక్క

దివాకర్ల వెంకటావధాని

అమలిన జీవితుండగు మహాత్ముని మృత్యువుచేత శాంతి స
త్యములకు సానుభూతికి నిరాశ్రయ భావము సంఘటిల్లె ను
త్తమము చరిత్రయున్ దయయు దానలమేది కృశించె గాఢసం
తమసము క్రమ్మె లోకుల మనంబుల సర్వదిగంతరమ్ములన్

భారతమాత కష్టముల పాలొనరించెడి జిక్కుప్రశ్న లే
తెరగ జవ్హారాదులు మతిప్రతిభానిధులయ్యు నాయకుల్
దారియు తెన్ను లేక కలతంబడ చిక్కడలించు బుద్ధి బృం
దారక దేశికుం డమరధామము చేరె నికేమ దిక్కకో ?

దీనుల పాలి కల్పకము దేశముగాంచిన పెన్నిధానమున్
మానవ సంఘమంపు దలమానికమున్ గరుణాస్వరూపునిన్
జ్ఞాననిధానమున్ జనకసన్నిభు నంధమతాభిమానకౌ
ర్యాస వధించి వాడు సకలాపనిగుండెలు చిల్చె నొక్కటన్

చావెటులైన మర్త్యులకు సంఘటిలున్ మృతిగన్నవారి స
ద్భావమునెంచి ఏడ్చుటయు వ్యర్థము కాని అహింసకోసమై
జీవిత మంత వెచ్చిన విశిష్టుని హింసకు బాలుసేయు దుర్
దైవము చెయ్దుమెంచినయథాయథలై హృదయమ్ముకుంగెడిన్



# అహింసా జ్యోతి

ఓయిమహాత్మ ! లోకము సమోహమయమై హతమారిపోయిన
ట్లయిక నిన్ను బాసి యెవడెక్కడ నేమిటఁ బ్రొద్దుపుచ్చునో
న్యాయము చట్టుబండలయి యారడిపోయెనె? పాడులోక మీ
గాయము మాన్పుకో నయితిగాక కృశించి తపించి పోవదే!

బంగరు వానవెల్లువలుపారి ఫలించి ప్రపంచమంతయున్
గొంగున దాచిపెట్టు నదిగో! నవభారతమంచు మించియు
ప్పొంగితిమయ్య దానినిజమున్ గురుతించెడివేళ నిట్టుల
య్యెంగవ యాయిపాపపువిధీ! నినుమెత్తురె లోకులిత్తరిన్

గండములన్ని దాటెను సుఖంపడు భారతదేశమింక నీ
యండను ఖండఖండముల కద్భుతశాంతియు నివ్వటిల్లు బా
జ్యండవు నిన్నుజూచుకొని చొక్కియు నిక్కియు మాకు బుణ్యముల్
పండె నటంచు చెప్పుకొను భాగ్యము పోయెగదా! మహాప్రభూ?

మ్రాయులు వన్ని రాజ్యము లమాంతము గుక్కిటపట్టి నెత్తుటల్
దోయిటఁ ద్రావి మైకములతో నదిజీర్ణముగాక జాతికిన్
గాయముగూర్చు నేటి పలుగాకుల గూళల ముంపలింపగా
న్యాయము దీర్పగా దగిన నాథు డికెవ్వడు చెప్పుమో విధీ

క్రొత్త సత్యనారాయణ చౌదరి

# అహింసా జ్యోతి

ఆలము దీరిపోయె జయమన్నది భారతిజాతి దయ్యె నిం
కేలనిరాశ! సర్వజన మీఋషిపుంగవు దివ్యబోధలు
వ్వేలముగా వినంగను బదింబది వాగమృతంబు గ్రోల రా
రేల యటంచు నుచ్చదశ నిచ్చియు నిట్టులొనర్తువే ప్రభూ

ఈ కొరగాని దేశమున కింక మహాత్ములు పుట్టబోరు - లో
కైక మహాత్ము దాచుకొన రైరిగదా! యొకయాతతాయి చి
కాకయి దేశగౌరవము గాలనురాచి మతంబులోన ము
క్కలు చేసియున్న మొనగానిని గుక్కిట బట్టి మ్రింగునా!

మతమున ద్వేషమున్ బొడిచి మాయని గాయము సేసి దాని దు
స్థితి గురుతింపలేని యొకదేశము చూపెడి చేష్టలిట్టివై
వెతలనుగూర్చు దానను విభిన్నత రూపము పెంచి సర్వదు
ర్గతులకు దావలంబయి వికావికలై యదికూలిపోవదో!

అదిగో! తూరుపుదిక్కులో నెరుపు దృశ్యంబయ్యె - నామీదన
య్యుదయంబున్ గనవచ్చునంచు మదిలో నుత్సాహ ముత్సేకమై
పొదలం రిచ్చిన గారుచీకటులు సంపూర్ణంబుగా గ్రమ్మి య
భ్యుదయంబున్ హతమార్చె శాపమదియేమోగాని ఈజాతికిన్

   

# అహింసా జ్యోతి

తమము దొలంచి మానవునెదన్ కరుణారుణమైన జ్యోతి ని
త్యము వెలుగంగజేసిన మహాత్ముడు భారతరాజ్యలక్ష్మి శీ
ర్షమున ధరించు మానికము సత్య మహింస భజించు నవ్య గౌ
తముడు మహానుభావు డవతారము మానెనె నేటితో కటా

రాజకీయ జగత్తులో ప్రభవ మైన
ప్రళయ ఝంఝలు మతవిప్లవ ప్రభూత
సమయకీలలు కదలింప జాల నట్టి
హైమగిరి నిప్పుతగిలి నీరయ్యె తృటిని

కనుల నీరు తొణుకు కలవరపాటుతో
నగము వంచు చిక్క మొగము తోడ
బరువు గుండెతోడ బావురు మననట్టి
భారతీయుడేడి బాపుస్మృతికి

మేలిదుపూన్కి ముందుగ గమించెదు మేటిప్రవక్త దు
ష్కాలము మచ్చరించి కడు క్రౌర్యముతోడ తుపాకి పేల్చగా
గూలె సమైక్యభావములు కుంటువడెన్ మనజాతి కీరుతుల్
క్రీతెను సభ్యమానవుల ప్రేమరసాత్మకమౌ యెడందలున్

వావిలాల నరసింహారావు

## అహింసా జ్యోతి

హరిజనబాంధవుండు సుగుణావళికిన్ వరుణాలయుండు సు
స్థిరతరసత్యవిక్రముడు శిష్టజనస్తుతిపాత్రవర్తనుం
డరిమురిలేనిధార్మికుడహంకృతిపొందని కర్మయోగి యా
చరణకుమార్గదర్శకుడు సర్వసముం డికలేడు భూమిపై

వినరావుగా ముందు వేదబుక్కులవంటి
వాక్యార్థములు కర్ణపర్వములుగ
దానమీయడుగదా మానినీ నివహంబు
పసుపు కొమ్ము ధరించి పసిడి తాళి
ప్రార్థనలందున పల్కగాబడవుగా
బైబిలు ఖురాను ప్రవచనములు
మార్మ్రోగమగదా మహితసత్యాగ్రహ
కర్తవ్య విజయ శంఖాస్వనంబు
బోసిగవ్వులు కుంకుమబొట్టునుదుట
పొడుగుచేతులు కొల్లాయి నిడుదకోల
బ్రహ్మతేజము గుభుతులైపరలునట్టి
వృద్ధతాపసికనుపింప డింకమీద

   

# అహింసా జ్యోతి

ఆదుర్వార్త వినంగనే మనసు నీరైపోయె - నాగుండెలో
ఏదో తీరని బాధహెచ్చినది - నాయిల్లాలు నాబిడ్డలున్
నాదుఃఖంబున పాలుపంచుకొని రానా డీజగత్తంతయున్
చెదైపోయెను - తాతతోనె నశించెన్ విశ్వసౌభాగ్యముల్

ఆరిపోయెనుగదా? అన్నిలోకాలను
వెలిగించు నిర్మల ప్రేమ దీప్తి
ఆగిపోయెనుగదా? అన్నిమతాలకు
సఖ్యత కలిగించు శాంతి గీతి
చచ్చిపోయెనుగదా? సర్వతోముఖముగా
చెన్నారు భారత జీవశక్తి
నిలచిపోయెనుగదా? కులభేదమెరుగని
రఘుపతి రాఘవ రామభజన

నీవు హా! రామ! యనుచు ఈనేల గూల
వేయిపడగల సామియే వివశుడయ్యె
ప్రకృతి యంతయు చైతన్య రహితమయ్యె
నీవు కనుమూయ జగతి నిర్జీవమయ్యె

మహావాది వేంకటరత్నము

బుద్ధ దేవుని భూమిలో పుట్టి నావు
శాంతి పాఠాలు కుదురుగా చదివి నావు
జీవకారుణ్య సూత్రాలు చెప్పినావు
కరుణ మూర్తివి నీకు దుర్మరణ మేమి ?

నెత్తురు చింపకుండ - ఒకనిన్ బలివెట్టక - కత్తిలేక లో
కోత్తరశాంతి పూర్వకమహోద్యమ మొక్కటిలేవదీసి - ఉ
ద్వృత్తుగవైరిశక్తుల జయించి స్వతంత్రతగొన్ననేవిం ? నీ
నెత్తురు ద్రావెనేటి కొకనీచుడు - బాపు ! ఇదేమివైరమో ?

మతములు - సంప్రదాయములు - మానవలోక విభిన్నతత్వక
ల్పితములు - వీనికై మనము పెద్దపెనంగుట తప్పు - జాతియై
క్యతకివియెల్ల కానివని అందరెరుంగగ చెప్పినందుకా
మతిచెడి నిన్ను కాల్చినది ? మాకిది మాననిపుండు బాపుజీ !

చితిపై నీతనువున్ దహించినది రాశీభూతమైయున్న దు
ర్మతవిద్వేష మహోగ్రపావక శిఖాప్రాబల్యమేకాని - నీ
సుతు డంటించిన నిప్పుగాదు - భరతక్షోణీతలంబెల్ల నీ
మృతికై మిక్కిలి పొక్కుచున్నది - పితాజీ ! యెట్టులోదార్తువో ?

   

# అహింసా జ్యోతి

ఆగని కంటినీటబడి 'హా'యని ఏడ్చెడి విశ్వఘోష నీ
కేగతి వీనులం బడదొ? ఏగతివా మముఁవీడి తాత 'వి'
యోగము మానుజాతికి వియోగమె కాదు - భరింపరాని శా
పాగమనంబుగా ఫలిత మాయెను మానవి మప్పుగా - ఇటుల్

నీ కరుణామృతాంశు కమనీయ వినూతన కాంతినంది మా
యాకృతి విశ్వరంగమున అందిన దయ్యె యశః ప్రదీప్తులన్
ఆకరిముందు కాల్చిన రివాల్వరు గుండ్లు నిజంబు నీకు కా
డీ కలుషంబు జాతికె విధించెను శాశ్వతమైన గుర్తుగా

ఆ నవఖాళిలోన పటుహంతకు లంచును పేరుగొన్న వి
జ్ఞానవిశూన్య మూఢులె విశాలవిస్మృత నీనుపూజలో
ప్రాణము లిచ్చినారు తమబంధువులన్న సరాశిలోన నీ
కైనను శేషమర్తశ మహాత్మ! పచించిన సిగ్గునగదా?

నీ చరశన్ లభించు కమనీయ భవాకృతితోడ బుగ్గయో
నీచితిలోన దగ్ధమయి నిక్కము మాదుకళావిలాసముల్
వాచవిగాని పల్కులు శుభంబులు గావు - స్మృజింతు నీకిదే
దాచిన కంటి నీరమును తర్పణగా గొను మోయి బాపూజీ

విద్వాన్ 'కొండూరి'

# అహింసా జ్యోతి

హతవిధీ! బొట్టబెట్టితే అనుపమాన
శాంతిమయజీవి నిటు మహాసాధుశీలు
నింక జగతిని తావెద్ది? ఎంచి చూడ
సత్యము అహింసకిద్దియా సత్ఫలంబు.

సత్యము అహింస ఈరెండె జగతి నెపుడు
వెలయ గలవని చాటిన వీరు డితడు
నేడు బలియయ్యె నక్కటా! నీచ మైన
కుమతి చేష్టకు బ్రజలెల్ల గోడు జెంద

భౌతిక శరీరమొక్కటే వాసె గాని
అనుపమంబైన అతని ఆత్మ శక్తి
నిండుకొని వెల్గుచుండె బ్రహ్మాండ మెల్ల
మించి ధాత్రిని పునరుద్ధరించు గాత

పోయెడివారలే పుడమి పుట్టిన మానవకోటు లెల్ల నీ
కాయము లంతరించెడివె కాని భవాదృశ కీర్తనీయ శో
భాయుత దివ్యజీవనుల బాయుట దుస్సహమౌట నిట్టు వా
పోయెద మయ్యొ దిక్కెసెడి పూజ్యచరిత్ర మహాత్మ బాపుజీ !

ధూపాటి కొండమాచార్యులు

# అహింసా జ్యోతి

ప్రార్థనా సమావేశ సభా ముఖాన
శాంతి సత్యాలు నినదించు సమయమందు
చంపెనటె నిన్ను నో అహింసాతపస్వి
కఠిన పాషాణ హృదయుడొకడు తెగించి

నీ వొక్క ద్రోహిచేత మరణించితి వన్న విషాదవార్తకీ
స్థావర జంగమాత్మక విశాల జగస్థలి గుండె నీరుగా
బావురు మంచు యేడ్చినది - భారత భాగ్య విధాత! నీమన
ద్భావమె నీకుమృత్యువయి తారసిలెన్ తుది నక్కటక్కటా!

మంచికి మంచిలేదసలు మానవ జాతికి మానవత్వమున్
పెంచి సుఖింపుడంచు వినిపించిన శాంతుని క్రీస్తు నిట్లె చం
పించిరి - స్వార్థమున్ విడిచిపెట్టి స్వదేశముకోస మింతక
ష్టించిన బాపుజీ బ్రతుకు చేదయి కాల్చిరి నేటికక్కటా

ఆరని మంట నాయెడద యందున నిల్పితివో ప్రభూ ఇకన్
తీరని బాధతో కుమిలి దేశము దిక్కును మొక్కులేకనం
ధకార విహీనమై బ్రతుకు చావుల మధ్యకృశించి ఇంకనే
ఘోర విపత్పరంపరలకున్ గురికావలెనోగదా తుదిన్

కామేశ్వరి

## అహింసా జ్యోతి

ఒకవిలయమ్ము పెంచికొని యొక్కఁడు నిన్ను సమస్తలోక భా
వుకశుభమూర్తి శాంతిపరిపుష్ట వినిశ్చలధీరు - శోక ని
శ్చకితహృదంతరాంతరు ప్రసన్నమనోహరరూపు - సాధు తా
నికషము పొట్టపెట్టికొన నేర్చెనటే ప్రళయాంబు దార్భటిన్

ఆ రూపై చనుదెంచు కల్మషముతో నయ్యయ్యో యూహించెనా
కైరాత్యప్రథ క్షీరకుంభవిష దిగ్ధప్రక్రియా నైపుణుల్
సారోదారవచస్సుధాతుషితశశ్వద్విశ్వ కహ్లార నీ
హారాంశు గ్రసనోద్ధరాహుకుటిలవ్యాపార నైష్ఠుర్యముల్

నీపై నీవు దివంబుకేగ ప్రభువా! నీరేజముల్ మాధురీ
భావశ్రీ గయిసేయలేవు సుమనోవ్యాపారముల్ మ్లానముల్
పూవిన్ గొంతుపెకల్చలేవు పికముల్ మ్రాన్పాటుమై యుర్వి తా
ప్రోవుల్ జేసిన దుఃఖమయ్యో గరుణామూర్తీ! వెతల్ నింపెతే!!

ఓసత్యాగ్రహి! సర్వలోకవినుతాత్యుత్సాహదీ ప్రాత్మ దీ
క్షా సామ్రాజ్యరమాధినాధ! నిఖిలాశాపూర్ణ కీర్తీశ్వరా!
నాసాంతఃస్ఫుట కించిదుజ్ఝితకవోష్ణ శ్వాసనిర్యాత న
ర్వాశాదేశ విరోధి ద్బాధ! యిదె సాష్టాంగమ్ము రాట్ప్రియా!

అయాచితుల హనుమచ్ఛాస్త్రి

# అహింసా జ్యోతి

ఖ్యాతి నొకనాతిగా చేసి శ్రీరామ చం
ద్రుడు సువాసించె విశ్వమ్ములో యుగమూర్తి
సుప్తాంధధూళిలో శూరకోటుల లేపి
జీవ మిచ్చిన నీవు అన్నియుగముల జ్యోతి !

భారతీయుండ నీవని నేను పొంగిపో
నకలేతరధరిత్రి నన్ను నవ్వాను స్వామి !
ఉన్మత్తుచే నీవు తెగి నమసి నావన్న
ఈబ్రతుకె సిగ్గుతో తలవంచుకొను నయ్యా

యుగయుగాల్ తరలి పోవును కాని నీవదిగో
ఈవైపు ఆవైపు అన్నివైపులనీవె !
ఎక్కడా ఒకటే అహింస దయ ప్రేమపరి
పూర్తి ఎన్నటికి లోకాల కొకడవె బాపు ?

రామచంద్రి అప్పారావు

# అహింసా జ్యోతి

నాయకు లెంద రిందు జననంబును గాంచరు ? కీర్తిమూర్తులై
హాయిగ మేనులన్ విడువ ? రందఱ కబ్బుట జూడగల్గినా
మే - యవసాన సత్క్రియలు - ఇంత ప్రపంచముదోసిలొగ్గగా ?
ఓ యతిలోక శాంతసుగుణోజ్జ్వల రంజితమూర్తి ! బాపుజీ !

పలుకులురాని బాలకుల భావము సర్వము చేర్చినట్టి వి
జ్ఞుల హృదయంబు లొక్కగతి జూఱగొనంగల శక్తి బాపుజీ !
కలిగెను నీకు నొక్కనికె కాలముమెచ్చుచు నీమసేవ వి
చ్చలవిడి జూపుకొన్న దవసాన విధిన్ దన సత్కృతజ్ఞతన్

మును మనబుద్ధశంకరు లమోఘవిధంబున జాతిరక్షణం
బును సలుపంగలేదె ? మరిపూజలనందడె హూణజాతిలో
ననపరతంబు క్రీస్తు ? - అవురా ! కనవారలునీకుదుల్యులే ?
తనువు ధనంబు ఆత్మ బలిదానముజేసిరె యన్యజాతికై ?

లోకశాంతికి సతము లోలోన మఱగి
కఱగి ఆత్మార్పణము సేయ గలిగినట్టి
నీకు - ఆలోక మిపుడు కన్నీటి తోడ
ఆత్మశాంతికి ప్రార్థింప నయ్యె నకట !!

కోట వీరాంజనేయశర్మ

# అహింసా జ్యోతి

కత్తుల గడ్డయైన నవఖాళీతటంబున శాంతిబీజముల్
విత్తిన హాలికా అహము వీడని హైందవజాతి భూతమే
మిత్తిగ మారె నీయెడల - మించె దురుష్కమతాలమౌఢ్య సం
పత్తిని మామతమ్ము - నగుబాటయి పోయెను నాల్గునోళులన్

దాస్యాంధ జగతిలో దారిజూపెడు వెల్గు
వెల్లువవై ముందు వెడలి నావు
"బానిసవై పరిపాలన నుందువా?"
లెమ్మని నిద్దుర లేపి నావు
నిరుపప్లవంబులై నెంపు సత్యాగ్రహ
సమరముల్ మెండుగా సలిపి నావు
నలువదికోట్ల మానవసంఘసేవకై
జీవిత మర్పణ జేసి నావు
చరితలో మున్నెరుంగని శక్తి జూపి
ఖండ ఖండాంతరాలలో ఖ్యాతి వడసి
మతసమైక్యత జగతికి హితవటంచు
నచ్చ జెప్పుటకే ప్రాణ మిచ్చి నావు

బృందావనం రంగాచార్యులు

# అహింసా జ్యోతి

అతిహేయంపు దురాగ్రహమ్ము మము దయ్యమ్మట్లు లాడింపగా
మతభేదమ్ము నవారిజేయ మెడపై మాతండ్రిరక్తమ్మె భా
రతభూమిన్ పొలిజల్లి యీగతిని దుర్మార్గమ్ముగా కాలరా
చితివే ! బాపుజి ! విశ్వధారుణియె నిస్స్వమమ్ముగా రోదిలన్

భారతజనయిత్రి పాలబుగ్గల మీద
కాలువల్ గట్టెడు కంటి నీరు
స్వాతంత్ర్యవీరుని బ్రదుకు టెడారిలో
ఉవ్వెత్తుగా రేగుచున్న ధూళి
భారతదేశ సౌభాగ్యతపస్వులు
నేలనొడ్చెడు కంటి నెత్రు టేళ్ళు
ఉప్పెనయై పొంగి ఉరుకు హిందూమహా
పాథోధి భీకర భంగ పాళి

ప్రళయపరిణత నిష్ఠుర ప్రకృతి యటుల
కురులు విరబోసి కొని ఆడు కొఱవి దయ్యా
ముల యటులు చిందు ద్రొక్కుచు కలుగు చున్న
పవిగొ బాపుజీ ! నీవటు కదలినంత

కణ్వశ్రీ

# అహింసా జ్యోతి

కన్నులు విప్పుకున్న పసిగందుల మాటలు రాని నూసలన్
చిన్నతనంపు చేష్టలనె చేసెడు బిడ్డల బానిసత్వపున్
ఖిన్నములెల్ల బాసి అనపాయముగా మెలగంగ నేర్పితే
కున్న అభాగ్యసంతతి సహాయా! మము బాసితి వెట్లు బాపుజీ!

చనినాడే మమువీడి సర్వసముడున్ శాంతిప్రపుంజైన మా
జనకుండంచు ప్రజాసమూహమున కాశాజ్యోతి చల్లారెనే
యనుచున్ పోయెనె? మానవాభ్యుదయకార్యాన్వేషియం సోక్రటీ
తని వాపోయెడు మేమికేమిగని శాంతింపంగనౌ బాపుజీ!

నీతుల గుప్పతెప్పలుగ నేర్చి వచించెడి వారె. కాని నీ
భాతినిచేసి చెప్పగల భవ్యులు నేడగుపింప రట్టి ని
ష్ఠితరి చేతులార నమయించిన హైందవజాతి కీయుప
ఖ్యాతి తిరంబుగా నిలుచుగాని తొలంగుట యెట్లు బాపుజీ

స్వర్గఖండము వేతె భూస్థలిని నిత్య
సౌఖ్యముల నిల్పుదగు పనుల్ జరుగ లేమ
పీడితులకేమి దారిజూపించి ఇటుల
పోయి నాడవో? దివికి మాపూజ్య బాపు!

చిలివేరు వేంకటరత్నము

# అహింసా జ్యోతి

అడగెనా ఒక్క మహాదీప్తి శమదమ
సుందర దివ్య తేజో మయంబు
మడిసెనా ధర అహింసాబోధనామృత
మూటలూరిన బోసినోటి తపసి
గూలెనా కట్టిన కొల్లాయి కొంగున
కోటులర్థించి గైకొన్న భిక్ష
అరిగెనా సత్యాగ్రహముతేరునడపి స్వ
రాజ్యమ్ముగొన్న సారథియు రథియు
పోయెనా భారతాంబిక పొగులు బాపి
దాస్య బంధమూడ్చిన వినతా సుతుండు
అస్తమించెనా గాంధి - మహాత్మ గాంధి
అయ్యో! ఎంతటి పిడుగు పాటయ్యె నేడు

అదియొకదివ్యపుష్పము వియత్తలముండిగి భారతాంబికా
పదములరాలి శాంతిమయవాసనలన్ జగముల్ గుబుల్కొనన్
బొదలిచి భారతీ చరణపూజముగించి దివమ్ముజేర తు
మ్మెదరొద తావి తెమ్మెరల మేదురతల్ మిగిలెన్ హతావనిన్

అంబడిపూడి నరసింహశర్మ

బాపూజీ ! భవదీయభౌతిక తనూబంధమ్ము మాయమ్యెకన్
బాపన్ జాలిరిగాక పాపులు మతోన్మాదంబునన్ కాని ద్రో
హాపీనూపనిభమ్ము నీసముపదేశమ్మాని మాచిత్తమం
దే పుంబొందిన నీమరూపు టొరపుల్ హింసింపగా నేర్తురె ?

అదిగో చూడుము దివ్యయానమున కల్పానల్పపుష్పావళుల్
పొదువంగాబడు పూలపాన్పుపయి కొల్వుండిరి కస్తూరు నీ
రధులై పారగ తండ్రితే సనదలై రాత్రింబవళ్లే కగ
గ్గదికన్ నీకయి నేడ్చు విశ్వజనసంఘాతమ్ము గాంధిప్రభూ

ఎనుబదియేళ్ల నాడు మనహిందుపురంధ్రికి కంఠహారభూ
షణము లభించె క్రొంచళులకు జాయమెరుంగుల దిద్దితీర్చి ఈ
దినమున గాంధినామకము దివ్యము రత్నము గోలుపోయి ఆ
జననిగళమ్మునన్ నిలిచె నశ్రునిదారము కంఠహారమై

శాంతి కొరవడి దిద్దునోజవు అహింస
బలము రూపించు తపసివి భరత ఖండ
ముక్తి కిరవగు వెలుపు పొంద వీవు
గాంధిజీ ! నీకిదే నమస్కార శతము



# అహింసా జ్యోతి

నీ పుట్టుక మాగర్వము
నీపూజ్యత మాయశస్సు నీవిజయమ్ముల్
మాపున్నెపు చారిత్రము
నీపతనము సిగ్గు! మాకు - నేలకు - ప్రజకున్

తొలిసంజల లోపలి వె
న్నెల చిన్నెల మఱచికొన్న నీ నగవులలో
పులుతొలగిన భారతి కన్
గొలకులు కురిసినవి జగతి కుశలాశీస్సుల్

ఎన్నటిపో బోధివిరులు
వెన్నెలలై కాచె నేడు విశ్వంభరలో
క్రన్నన పున్నమ వచ్చుట
ఎన్నటికో ఈతమాల శృంగక్షితిలో!

గాంధిదేవుని నిర్యాణ గాథ పిదప
మానవుడు నల్పలేని దుర్మార్గ మేది?
పశుత క్రమ్మిన యెడద లోపల పిశాచ
నటన కాబోలు మనుజుని నడత నేడు!

వేమూరి వెంకటరామనాథం

# అహింసా జ్యోతి

ఒలికిమెట్టదికాదు, పలురకాల పువ్వులఁ
గ్రాలి యెగయు డగోటాల బారు :
యమునానదీ సైకత మది 'కా దిసుక చే
సిన రాలని యవనీ జన భజనము ;

ఆండ సూర్యునకగు కొండ గాదది, పేర్చ
మంచిగంధపు జితి మంచె యెత్తు;
ఆది సోడు కగ్నిగా, దాడనే యస్త్రమ
యారుణద్యుతి యన్న యభ్రపు టెఱ

ఆనగ జరిగె నెవ్వని భౌతి కాకృతి తుది
నల్ల గాంధీమహాత్ముని అస్థి భస్మ
మెల్ల నదుల మున్నీట నీహిందుదేశ
మందు నేడు గలిసె నున్న దేమందు నింక ?

ఒకటి మాత్రము నిజము సాయుజ్య మతడు
పొందె లోకంబునందు నింకెందు నున్న;
ఎల్ల మతముల స్వర్గాల ముల్లె గొంచు
నతడు సాయుజ్య మందె విశ్వాత్మ యందు.

కవికొండల వేంకటరావు

# అహింసా జ్యోతి

కఠిన విలయంపు గండాలు గడచి పోవ
సూట పాతికేడుల మాట నీట ముంచి
తల్లి దేశమ్ము కొరకు స్వతంత్ర మొనగి
మంచిదని దేహయాత్ర చాలించినావ !

అంధకారమ్ము నలుదెస లావరించ
గర్జనల లోన కాల మేఘాలు మెఱయ
దారి జూపక నాయకా! తరలి నావ।
అస్తమయ మటే! గాంధీమహాత్మ! - నీకు

అఖిల భారతమే గాదు నిఖిల జగము
కంట నీర్వెట్టి విలపించె కంప మెత్తి
పిడుగు పడినట్లు హృదయాలు హడల దొడగె
గాంధి తాతయ్య చేరె స్వర్గమున కనుచు,

హింస తగదని శాంతి అహింస తోడ
కత్తి పట్టగ హిల్పోగు కదురు తోడ
మాకు స్వాతంత్ర్య ఫలము సమర్చి నీవు
హింస పథమున బలియైతి వే! మహాత్మ!

జంధ్యాల వేంకటశాస్త్రి

కటకట ! వింటి మప్పుడుగుకంటెను బెట్టిద మైన వార్త హృ
త్పుటములు రెండుగా జెదిరి పోవ ; మహాత్ముడు గాంధితాతయే
కుటిలు తుపాకి కాల్పునకు గూలె నటన్న - మరెట్టి ఘోర సం
ఘటనలు పొందగా గలుగు కాలమొ? భారతదేశమాతకున్

మహిళా శిరోమణి మానభంగము సేయు
క్రూరుల గొంతులు కోయ రాదె !
అసహాయులను బట్టి హత్యలు కావించు
కడునీచులను మంట గలప రాదె !
నోరెరుంగని వారి కారుకూతలు పేలు
దుష్టుల నాల్కలు త్రుంచ రాదె !
ముల్లె మూటలనెల్ల కొల్లగొట్టెడి ముఠా
కోరుల నొకమారె కూల్చ రాదె !

ఓరి ! చండాల ! పొగరెక్కి భారతీయ
భావిభాగ్యవిధాతను వరమునీంద్రు
కాల్చి చంపితి వక్కటా ! కల్మషంబు
మట్టుపెట్టదే ! జన్మ జన్మాల కైన

# అహింసా జ్యోతి

మనదేశాభ్యుదయప్రవక్త నొకదుర్మార్గుండు చేసేత కా
ల్చిన దుర్వార్తను విన్నతోడ మది దుశ్చింతామయంబయ్యె క
న్గొనగా సర్వజగంబు శూన్యమయి మాకుందోచె నీనాటి కీ
ఘనదుర్దాంత విచార వారినిధిలో గన్మూయగా నేర్పడెన్

భారతశాంతిదూతవని, భారతభాగ్యవిధాతవంచు ని
ద్ధారుణి సర్వదేశవిబుధ ప్రకరంబు వచింప నక్కటా !
క్రూరకిరాతకృత్యమున గూలితి వయ్య మహాత్మ ! ఎవ్వ రా
ధారము మాకు సర్వశుభదాయకమార్గము బోధసేయగ౯

రవి యస్తంగతుడైన రేపె పొడుచున్ ప్రాగద్రిపై నూతన
చ్ఛవితో; నీవిపుడస్తమించితివి; తోచన్‌రావు మాకంటికిన్
భువిలో నీవవతారమూర్తివని సమ్మోదంబుగాబల్క, నీ
యవతారంబునుబాసియేగితె ! మహాత్మా ! స్వర్గసౌధానికిన్

తనవిజ్ఞానమహాప్రభావమున రక్తస్రావమేపాటి బొ
ట్టును చిందింపకయే భగీరథునిపట్టు౯ బట్టి స్వాతంత్ర్యము౯
గొనియున్నట్టి మహాత్మగాంధి ముదివగ్గు౯ నద్గుణానీకవా
ర్థిని గోల్పోయితివమ్మ ! భారతధరిత్రీ ! ఎంతనిర్భాగ్యవో

   

# అహింసా జ్యోతి

తమసకలమ్ము దీనజనతావనపావనయజ్ఞహోమకుం
డమున హుతమ్మొనర్చి అమరత్వము నందిన క్రీస్తు గౌతముం
డు మహమదాదిధీరుల నెటుల్ కఠినమ్ముగశిక్షచేసె లో
కము మును - నేడునట్లు మనగాంధికి శిక్షవిధించినాముపో !

మనప్రాపుఁ మనబాపు నిట్లు మనమై మ్రందించుకొన్నట్టి దా
రుణపాపంబిది ఎంతసేయునొ ! శుభాలోకమ్మునఁ నేటిదా
కను కాపాడిన ఆర్షశక్తి భరతక్ష్మానింక కాపాడునో !
పెనుముత్పాతము లేవి భావియుగ దుర్వీధిఁ నిరీక్షించునో !

కత్తికి కత్తిదూయు తొలికాలపు టాటవికప్రవృత్తికిఁ
చిత్తును మారలేదు - తనచేతననిల్చిన కొమ్మ తానె వి
చ్ఛిత్తియొనర్చు మూర్ఖత నసింపదు - మానవజాతి ఇట్టులీ
యెత్తున పోయి పోయి తుదినేపరిణామము నొందనున్నదో !

జ్యోతిమలగెను పెనుతమ ముర్వి గ్రమ్మె
ఇంతసైన వాస్తవము గ్రహింప రేమి ?
చనిన పితకు వాఙ్మాత్రానుసరణ మనెడి
ఆత్మవంచనసేత భావ్యమ్ముగాదు

బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

# అహింసా జ్యోతి

సత్య ధర్మ దయా గుణ శాంత్య హింస
లన్ని నీమూర్తి సేవించి వన్నె గాంచె
పూజ్యభారత విపుల సామ్రాజ్యమందు
అనుపమాన కృపాత్మ మహాత్మగాంధి

నిర్మలమై పవిత్రమగు నీదగు ప్రేమసుధాస్రవంతిలో
అర్మిలి సోలలాడి భరతావని దాస్యనిదాఘకల్పమౌ
ఘర్మకణాల బాపుకొనగల్గిన ఈశుభదిష్టమందుసన్
కర్మమదేమొ ! దుఃఖమిటు గల్గెను నీవెడబాయ బాపుజీ

ఖండనమున్ బొనర్పకయె వైరివితండము కర్మభూమియం
దుండగ నీకనంపి ముదముప్పతిలన్ జయమిచ్చినావు మా
కండగనిల్చి భారతమహత్తరకార్యము లాచరింపగా
నుండెదవంచు నమ్మితి మయో ఇపుడే పయనించితే సఖా

గుండెచెమర్ప నట్టి హతకుం డరుదెంచి తుపాకిగుండ్ల నీ
యెండిన బక్కదేహముపయిన్ బడవేసిన ఘోరవార్తతో
బండలు సైతమున్ కరగ పాయని దుఃఖముతో ప్రపంచమే
బెండయి కంపమొందె కడుబక్క మొగంబిడె సృష్టిబాపుజీ

బబ్బిళ్ళపాటి కామేశ్వర రావు

## అహింసా జ్యోతి

చేతులుమోడ్తు భక్తిని అశేషమతాంతరసామరస్య సం
ధాతకు - పారతంత్ర్యపరదాస్యవిశృంఖలబంధితార్త సం
త్రాతకు - సర్వదాపతితతారకనేతకు - విశ్వమానవ
భ్రాతకు - భారతప్రథిత భాగ్యవిధాతకు గాంధితాతకుఁ

సరవి కృపారసంబును ప్రశాంతమనమ్మును సత్యశీలముఁ
పరమతసామరస్యము భవత్సహజంబులు - వీటిచేతనే
గురుతరమౌ స్వతంత్రమును గూర్చుటయుఁ - తుదకొక్క నీచుచే
మరణము నొందుటల్ గలిగె మాదురదృష్ట మదేమొ బాపుజీ

జీవితమెల్ల దర్పణము జేసి విదేశపు పాలవర్గముఁ
ఆవలగెంటివేసి స్థిరమైన స్వరాజ్యముగూర్చినట్టి ని
న్నా వధియించె క్రూరుడొక హైందవుడన్న కలంకమిం
కేవిధి మాసిపోవు తలలెత్తిమెలంగుట ఎట్లుబాపుజీ

మన్నుఁ మిన్ను సమైక్యమైనను అహింసా సత్య సౌశీల్య సం
పన్నుఁ నిన్నెదిరింపగాగలవె దైవంబే విధిప్రేరణఁ
మున్నా కృష్ణుని కట్టు ఘోరమరణంబుఁ నీకునుంకూర్చె గా
కె న్నఁగూల్పగలండె నిన్నొక ఖలుం డిద్ధాత్రిపైబాపుజీ

సంకా వేంకటరామారావు

# అహింసా జ్యోతి

ఒక్క దేహంబులో పంచప్రాణములను
నిలిపి ప్రాణము పోసి బానిసల బ్రోచి
చిరయశమ్ముమ సేకరించితివి దేవ
ధర్మగుణకంధి మోహనదాసుగాంధి

నీవాక్చాతురి బోధనాక్రమము వర్ణింపంగ సాధ్యంబె! సే
వావాల్లభ్యము లెంతయున్న తమలో వైరుల్గనంగన్ మహా
ప్రావీణ్యంబును జూపినావు తరణోపాయంబులందించి నీ
ధీవిన్యాసము లోకసుందరము కాదే దివ్యశోభానిధీ!

తల్లి స్వతంత్రభారతికి దారులు చక్కగ తీర్చి దిద్ది యు
త్ఫుల్లమొనర్చి నాయకుల పుత్రులవోలె సమీకరించి ఈ
ఇల్లికదిద్దికొండనుచు నేగిన భారతనేత! తాత! నీ
నల్లలితానురాగ విలసన్నవకాంతు లమోఘముల్ ఋషీ!

నీకీర్తి నిలుపు పుత్రుల
నే కన్నది భారతాంబ! ఇహలోకములో
శోకములు నీతిబాధలు
దాకని లోకమ్మునుండి దయజూడు ప్రభూ!

పెనుమర్తి కామేశ్వరరావు

## అహింసా జ్యోతి

"మనసారథి మన సచివుడు
మనవియ్యము మనసఖుండు మనబాంధవుడున్
మనవిభుడు గురుడు దేవర
మనలను విడనాడి చనియె మనుజాధీశా!"

అనుపద్యమ్ములు గుండెలో కదలి దుఃఖావేశబాష్పోష్ణవాః
కణముల్ చెక్కుల చాఱచాఱలయిరాగా కృష్ణనిర్యాణపుం
ఘననిర్వేద కథావిధమ్ము కనులన్ గట్టెన్ కిరాతాస్త్రమే
మనబాపూజినిగూడ మ్రింగెనట? ఏమాదైవసంకల్పముల్!

చనెనా? భారతగౌరవైక కృతదీక్షాకంకణస్వామి, యే
గెనటోయీ! పరిరబ్ధశత్రు సుహృదేకీభూతవక్షుండు, పో
యెనటయ్యా! పతితార్త దీనజనసాహిత్య క్రియాలోలుడౌ
మన 'బాపూ' మహితాత్ము, డింకగనలేమా? భారతోర్వీతలిన్

ఈవు మృతుండవైతివన నెవ్వరు నమ్ముదు రోమహాత్మ క్రొం
బూవుల తేరిపై వెడలిపోవు మహోజ్జ్వలమూర్తి! భారతీ
యావనిలోన శాంతి సుఖమన్నది చచ్చెనుగాని - ధర్మపుం
భావన చచ్చెగాని - యనిమాత్ర మనందగు నేటి నుండియున్

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

# అహింసా జ్యోతి

అఫ్రికా హైందవవ్యధ మాన్ప దివురు మ
హెూద్యమమ్మున నెత్తు రోడ్చి ఓడ్చి
తెలిపులి కఱకుకోఱల కండయై చిక్కి
భారతావనికినై పోరి పోరి
శ్వసృగాలములకన్న పరిహీనులన్న సో
దరులకై కన్నీట దడిసి తడిసి
ఇస్లాము పేరింటి హింసాకళంకమ్ము
అడరు శాంత్యమృతాన కడగి కడగి

కలలలో వెల్గు స్వాతంత్ర్య కలిత కాంతి
కంట బడినంతనే యొరకంట జూచి
పూలరథమెక్కి యెచటికో పోవు చుంటి
వయ్య! మహాత్మ! మరి రాని యాత్రదగిలి

నెత్రు ధారవోసి నిజదేశ దాస్యమ్ము
తరిమి భాగ్య మిచ్చి తనిపి నావు;
అగ్నిగోళకముల కాహుతి గావించి
మించి నిన్ను గౌరవించి నాము

* * *

# అహింసా జ్యోతి

ఉష్ణకిరణుడు చరమాద్రి సేర గిలగ
అరుణ కాంతులు నలుదిశ లందు క్రమ్మె
అతిభయానకమయ్యె సితాంబరమ్ము
రక్తయుతమైన ఖాది వస్త్రమ్ము వోలె

సత్యసంయుతశక్తి అసత్య మాయె
వెలుగు నశియించె చీకటు లలము కొనియె
అమృతమూర్తిని మృత్యువు అవరించె
ఎట్టిదారుణవార్త విన్పించె వాణి!!

ఏసుక్రీస్తును శిలగొట్టి రెపుడొ ప్రజలు
కాని ఈనాటి వాడు నాగరకు డంచు
నిను తుపాకిగుండ్లకు బలిగొనెను తండ్రి!
వీని యజ్ఞానమునకు కంపించె జగము!

హృదయము లేని మానవులకే నరిపోయిన ఈదినాల నీ
హృదయము దేనికో పరితపించిన దయ్యా! మహాత్మ! ధర్మమ
స్నది కలికాలమందున వినందగు మాటయె కాదు, కాని, నీ
మృదుతమమైన ఆత్మ జపియించెను దానినహర్నిశమ్ములున్

బొడ్డుపల్లి పురుషోత్తం

స్వాతంత్ర్య మ్మొకకంట జూచి చనియెన్ సత్యాగ్రహానందుడై
మా తాతయ్య, తదీయ నిర్మల కథల్ మన్వంతరస్థాయులై
చేతోమోదమెలర్పకుండ వయినన్ జీవచ్ఛవంబై జగ
జ్జ్యోతిన్ గూర్చి తపంపకున్న యణువున్ జూపట్టి దిప్పట్టునన్

పలుకొక వేదమై - మృదుల భావమహింసకు భాష్యమై - మనః
ఫలకము సత్త్వసంపదకు బాసటయై - చిఱునవ్వు వెన్నెలల్
కళలకు గాన్కలై - ముఖవికాసము శాత్రవమోహనాస్త్రమై
నిలచిన తాతపాదు లవినీతునిచే బడెనేమి చెప్పుదున్

ఓయి జగత్ప్రభూ! హృదయమున్నద? లేద? అజాతశత్రువున్
మాయమొనర్చినావు నిను మాహృదయమ్ముల కెక్కజెప్ప వా
రీ యఖిలప్రపంచమున నింకలభింతుర నీవివేక మే
మాయె నఖండభారత మహస్సిటు లార్పితి వేమి పుణ్యుడా!

రేపు చరిత్రకారు లొనరింతు రయోమయ భాష్యముల్ మన
స్తాపము గొల్పకుండ నవి సత్త్వసమన్వయబుద్ధి నిచ్చి హా
మీపడి శాంతిమై పులిని మేకను దిన్నగ నొక్క రేవునన్
ద్రాపిన బాపుజీ! భవదుదారదయాద్భృతి కంజలించెదన్

ముక్కామల రాఘవయ్య

# అహింసా జ్యోతి

ముత్యాలు గురిపించు ముద్దైన మోములో
వికృతాకృతియు కానుపించె నేమొ
సత్యాగ్రహాద్యమ సంస్థాపనములోన
కపట వాగ్దేవి దోగాడె నేమొ

హరిజనోద్ధరణకై హర్షించు దీక్షలో
నడుమంతరపు నీడ నడచె నేమొ
అనుపమ స్వేచ్ఛాజయ జయశబ్దంబులో
అశ్లీల మేమైన అమరె నేమొ

వాసికెక్కిన నీయుపవాస దీక్ష
కుటిల ధూర్తాళి కన్నులు కుట్టెనేమొ
కానిచో పరమ దుర్మార్గ కలుషమతుల
కఱకు బాణాలలో చిక్కగలవె గాంధి !

కాలవాహిని పలుతరంగముల నడుమ
నెన్ని సుడిగుండములు బుట్టి వెన్నువిఱచి
భావి భారత రతనాల భాగ్యరమను
ముంచునో? తేల్చునో? గాంధిమునివరేణ్యా !

బొడ్డు ప్రకాశం

# అహింసా జ్యోతి

ఏశూడు సముపయం బీమానవాళికి
నడలని చైతన్య శక్తి నిచ్చె
ఏ ప్రభావంతుని యాశాంతి కాంతులా
శాంతదేశంబుల నాక్రమించె
ఏ ప్రతాపాఢ్యుని యానముజ్జ్వల శక్తి
బలయుతు పరరాజు పారద్రోలె
ఏమిత్రవర్యుని హితచర్యలోకుల
హృత్పద్మ వితతి రహింపజేసె

అట్టి గాంధీదివాకరుం డన్నియెడల
స్వీయశక్తిని ప్రకటించి చివరకిటుల
కాలపురుషునకగ్గమై ఖగములవలె
నఖిలజనములు వాపోవనస్తమించె

బాపూజీయని లోకులేకగతి సంభావించి నీయాజ్ఞచే
కాపట్యంబొక యింతలేనిగతి చక్కంగా మహాశాంతులై
యాపద్వారిధులెల్ల గోష్పదము చాయందాటగాగల్గి రిం
కేపుణ్యాత్ముడు దిక్కుబిడ్డలకు గాంధీజీ! అహింసావ్రతీ!

కైతేపల్లి వెంకటసుబ్బయ్య

# అహింసా జ్యోతి

కులమతద్వేషాల కుళ్ళునుబోకార్ప
కృషిసల్పినట్టి సద్రుషివరుండు
తనువు ధనము దేశ దాస్యవిముక్తికై
ధారబోసినయట్టి ధర్మదాత

అస్పృశ్యతనుబాపి హరిజనోద్ధరణకై
పాటుబడ్డట్టి కృపాపయోధి
స్వాతంత్ర్యసిద్ధికై సర్వముఁ త్యజియించి
ఖైదులో తపియించు కర్మయోగి

అట్టిమనతాత గాంధీమహాత్ము డమర
పురిని జూడంగజనెనట్టి పుణ్యపురుషు
డెన్నిజన్మాలకైనసను గన్నుగవకు
కానుపించడు యెచ్చోట గనినగాని

ఎల్లవేళల చిరునవ్వు వెల్లివిరియ
శాంతి సంస్థాపనార్థమై జగతియందు
నసువు లర్పించినట్టి యయ్యమరజీవి
గాంధితాతకు షూనమస్కారశతము

భాగవతుల సత్యనారాయణశర్మ

# అహింసా జ్యోతి

ఒకజ్యోతిర్మయ దివ్యతారయకటా ! వ్యోమంబునందుండి నే
లకురాలెన్ - సకలప్రపంచగతి వైక్లబ్యంబుమై నిద్రలో
నికి జారెన్ - బసినహానతాచిగ మనోనిర్వేద భారావహా
నకమై మానపసంఘమెల్ల కుమిలెన్ - గల్యాణ సంధాయికై

అదియొక జాతిజీవన కళామలదీవ్యజగత్తు - దానిలో
గుమరుగ బ్రాణముల్ నిలుపుకొన్నవిసూ ! మతసామరస్య సం
పదలతి లోకమైన పరమార్థము డాగిన నందనమ్ము నే
డదిలయ కాలగర్భకుహరాంతరమందు విలీనమొందెనా ?

చితిపై బూడిదకిచ్చు గౌరవము నీ జీవించుకాలాన మా
మతికిన్ దోపదుగాని నేటికి మతోన్మత్తుండు నిన్ గాల్చెదా
నతిహీనుండని విన్నమాత్రన యెవో ఆలాపనల్ జేతురీ
పతితుల్ - జాతికి జేపచ్చినది - దౌర్భాగ్యంబు మొత్కెత్తిడిన్

మతములన్నవి మోక్షసామ్రాజ్యమునకు
వివిధ మార్గమ్ములంజూపు విధులుగాని
కఱకు గత్తుల చాటున బెరుగుచున్న
వికట మృత్యుకరాళదంష్ట్రికలుకావు

"మాదిరాజు" - "పార్థసారథి"

# అహింసా జ్యోతి

యుగయుగమందు ధర్మము సముద్ధరణంబొనరింప నీశ్వరుం
డొగి జనియించునంచు వినుచుందుము; నేడు మహాగ్రహింస క
త్యగణిత దుర్జనత్వమున కాహుతిజేసి ప్రపంచముద్ధరిం
పగనవతారమెత్తిన ప్రభాసితమూర్తివి కావె? బాపుజీ!

సత్యమహింస నాబరగు సన్నుతదీపికలన్ గరంబులన్
నిత్యముబూని భూస్థలి వినిర్మల శోధనజేసి యెన్నియో
సత్యములన్ బయల్పరచి సంస్తుతిగాంచితి వింతరోపలన్
హత్యనుజెందకున్న మఱియర్థములెన్నిటి జూపువాడవో!

భారత జాతి దోషములు బాపుచు సంగతి ద్వేషియ ప్రాణముల్
హారతిపెట్టినాడవు మహాశయ! తత్ఫలితంబుగా నిదే
భారతభూమియందు నొక భాసిత నూతనజాతి సంభవం
బై రహియించు లోకము సెబాసనగా భవదాత్మకాంతిగన్

సోదరులార! గాంధి మనక్షోణిని వీడెనటంచు దుఃఖమున్
ఈదుచు బోవుచుండ బనియేమి? మహాత్ముడు రేబవళ్లు క
ష్టాములకోర్చి సత్పథములన్నియు వైచెను వానివెంటనే
పోదము దాన బాపు మనపొంతన లేకను లోటు తీరెడున్

గుండిమెడ విశ్వనాథశాస్త్రి

# అహింసా జ్యోతి

ప్రతిశిలాప్రతిమ జ్ఞాపక చిహ్నమైకాల
అభ్రంకషముగ హర్మ్యం బొకండు
కట్టింతమా? ఏలకట్టింప? నీమూల
తత్త్వాల యున్నతుల్ దాక గలవ?
కాదు - స్ఫాటికశిలా ఖచిత మేకైక పా
షాణమ్ము తొలచి కూర్చంగ రాద
అనుకొందమా? నీమహాయశ మ్మంత శా
శ్వతమా? జీవితమంత పావ నమ్ము?
ఏదియును బోలకున్న దీ హృదయ వాంఛ
దీర్చుకొన బాలుపోకుండె దివ్య భవదు
దార జాతీయతా సముద్రమ్ము నందు
మునకవేసి తన్మయుడనై మనుటె దక్క

మానవత్వ ధ్వజంబెత్తి దీన దళిత
మానవుల స్వాస్థ్యమును అహింసా వ్రతాన
నోముచున్న మునీంద్రు హింసోగ్ర మృత్యు
నాస్యగుహ జేర్చినారె మహాత్మ గాంధి!

భారతుల మార్కండేయశర్మ

# అహింసా జ్యోతి

లోకంబంతయు నిద్రజెందినది నెహ్రూబాబు కెవ్వాపు ఆ
యాకాలంబుల సూచనల్ దెలుపువారా లేరు సర్వప్రజల్
శోకంబందున క్రుంగియుండి రసువుల్ గోల్పోయి రొక్కొక్కచో
నీకై యిట్టినరాధమున్ విధి విధిన్ సృష్టించెనా ? బాపుజీ !

నీహత్యన్విని లోకలోకములు కన్నీర్ నింపె భస్మాస్థికై
వాహిన్యాకృతి వేనవేల్ ప్రజలు బాష్పస్నిగ్ధ నేత్రాలతో
హాహా బాపుజి యంచు నేడ్చిరడలన్ వ్యర్థంబె సూచింప నీ
దేహంబింకను జూతుమే కరుణామూర్తీ ! ఓనిరాడంబరా !

నవఖాళిం దిరుగాడునాడు నిను కన్నారంగ వీక్షించి హైం
దవులున్ ముస్లిములున్ సమంబుగ దురంతాలెల్ల బోనాడి నిన్
స్తవముల్ జేసి త్వదీయ సూత్రముల శ్రద్ధాభక్తి పాటించి రెం
తవిశేషంబో ! యహింసచే జయము పొందన్ లేదొ మేధానిధీ !

బూడిద లోపలన్ కలసి పోయె శరీరము భౌతికాత్మునన్
దోడనె పంచభూతము లెమర్కొని లోగొనియెన్ జగంబులో
చూడగ నాత్మవెల్గు ప్రతిచోట వెలుంగుచు మాకు రక్షగా
వీడక నిల్చియుండె మరపించెను నీస్మృతి నేడు బాపుజీ !

మునగపాటి విశ్వనాథశాస్త్రి

# అహింసా జ్యోతి

అది నరాంతకు ద్వేషోన్మత్తపు కృత్యం
అది ప్రాణాంతకు మతోన్మాదపు కృత్యం

అది కాలాంతకు వికటాట్ట హాసం
అది దేవాంతకు ప్రళయకాలవేషం

అవి భయద ఘనాఘన గర్జనల్
అవి క్రూరదంష్ట్ర ఘట్టన ధ్వనుల్

అది ఘోరాటవీ దహ్యమాన దావానలం
అది క్రూరాసుర హన్యమాన హాలాహలం

అది మతకాసారమున కుళ్లినహృత్పత్రం
అది వర్గ సాగరమున కుంగిన హృద్యంత్రం

అది హృదయ విదారక దృశ్యం
అది అదయ నవిచారక కృత్యం

అది అహింసకే మారణ హోమం
అది ఆత్మీయతకే తీరని క్షామం!!

పిల్లలమర్రి వెంకటహనుమంతరావు

## అహింసా జ్యోతి

ఆరిపోయెను గటా! అఖిల లోకజ్యోతి
అంధకారము భువి వ్యాప్తి జెంద
అస్తమించిన దయ్యొ! అహింసా విజ్ఞాన
కిరణమ్ము మతమౌఢ్య మఱువు నంద
తరిగిపోయె నవురా! కరుణాసముద్రమ్ము
హరిజన బృందమ్ము లార్తి గుంద
దివికేగె నకటా! అవతారమూర్తి యా
పశ్చాత్తప్తప్రజల్ బావు రనగ
రక్తబిందు వొకండైన రాల కుండ
భారతాంబిక దాస్యమ్ము బాపి నట్టి
లోకపిత నింక జూడమీ లోక మందు
సురగణమ్మున జేరగా తరలి నాడు

భారత యుద్ధమున్ విజయ పంతము జేసి కిరీటికిన్ మహో
దార యశంబొనంగి యవతారము వీడిన కృష్ణమూర్తి కై
ఆరని శోకమగ్నుడగు నర్జును బోలె గృశించుచుంటి మా
భారతవీర జవ్హరుడు భారతభాగ్యవిధాతకోసమై

వారణాసి వెంకటేశ్వర్లు

# అహింసా జ్యోతి

ఎవని పేర్విన్న కనులముం దవతరించు
వ్రతకృశమ్ము కాంతిమయమ్ము బడుగు తనువు
ఎవని తలచిన మనములం దిరవు కొనును
సత్యసారమహిత మహింసా స్వరూప
మెవని నామమ్ము లోక మందెల్ల యెడల
శాంతి పర్యాయ మగుచు ప్రశస్త మయ్యె
అతడు నిత్యుండు విశ్వాత్ము డౌను కాని
కమల పంటయౌ మనగాంధి మనకు లేడు

దారుణమగు దృశ్యమునకు తల్లడిల్లి
పరువు లెత్తుచు భీతి విభ్రాంత మగుచు
మూక బాధతో వాయువు మూల్గ దొడగె
లోని వ్యథనెల్ల వెళ్ళగక్క లేని యార్తి

క్షణములో నిద్ది వైద్యుత జవము తోడ
శూలమన దూసికొని పోయె మూలలకును -
నిశిత శరవిద్ధ కుంభినా నేల యెల్ల
వణికి హెూరున గగ్గోలు పడికలంగె

'విద్యాపతి'

# అహింసా జ్యోతి

గాంధిజీ కేనాడు కలుగదు మరణమ్ము
చచ్చుచున్నది దేశ శాంతి కాని
వైవర్ణ్యమే లేదు బాపుజీ ముఖమున
మానవత్వము నేడు మాడె కాని
బాపుజీ రక్తాన పంకిలం బైనది
చరితమే కాని తత్త్వాలము కాదు
అయ్యయో! ఘాతకా! ఆమహాత్ముని జంపి
ఎది మూటగట్టుకో నెంచి నావొ!
క్షణములో ప్రాణముల్ తీయ గల్గి నావే
కాని యశేష ప్రజల గాచు చున్న
ప్రబల సంతాప వహ్ని నార్పంగ గలవె?
తర తరమ్ముల దుష్కీర్తి చెఱుపగలవె?

నీమేనంగల రక్తబిందువుల మున్నేనాడొ వెచ్చించి నే
డామాత్రమ్ముగ నస్థిపంజరము లాగైనన్ మనంగల్గకే
లా మావంటి కృతఘ్నదేశజులకై ప్రాణంబులన్ గూడ నో
స్వామీ! త్యాగముచేసి వైచితివి నిస్స్వార్థత్వ మిట్లొప్పనే?



ధరపయి పూర్వమెంద రవరత్నములెత్తరు - వారలొక్కరొ
క్కరొకమతంబు శాశ్వతముగా నెలకొల్పగ శక్తి ధార పో
సిరి - మతినీవొ స్వార్థముత్యజించి సమస్తమతైక్య సిద్ధికై
స్థిరతరచిత్తవృత్తి బలిసేయవె జీవితమైన బాపుజీ!

దెందుకూరి పురుషోత్తము

కులములు గోత్రముల్ గుడులు గోపురముల్ మలినమ్ముసేయ ని
య్యిలపయి గాంధినేడు జనియించె నటంచును దొంగశ్రోత్రియుల్
పెళపెళదిట్టిరప్పుడు - భువిన్ విడి నీ వపవర్గమేగ నిన్
దెలియగనైతిమంచు వినుతించుచు నేడ్వగసాగి రిప్పుడున్

చావలి శేషాచలం

నుడు గ్రుంకినంతన యభాగినియయ్యెను ఛాయ, నీవు నా
రితోడనేగగ అభాగ్యమ యయ్యెను లోకమెల్ల - నీ
.కోటియున్ భరతమాతయు రాలిచి రశ్రుబిందువుల్
మునిభా! భవద్విమల భావమె మాకుశరణ్య మింకపై

అత్తలూరి వెంకటపాపరాజు

రక్తపుబొట్టులేవియును రాలకనే మనకీ స్వతంత్ర తా
ముక్తిని సృష్టిచేసెనని మోదమునన్ జనులెల్ల గాంధిజీ
[illegible] ముగ్ధులై పరమ సౌమ్యుడటంచు భజింప, క్రూరతన్
రక్తముగార కొట్టెను కిరాతకు డొక్కడు దేశవైరియై

పూటుకూరి జోసెఫ్

నీసత్యాగ్రహదీక్ష - నీమధుర సందేశమ్ము - నీదేశసే
వాసౌభాగ్యము - నీఅచంచలవచః ప్రాగల్భ్యమున్ - నీఅహిం
సాసిద్ధాంతము - శాంతిఘాతుకులు దేశద్రోహు లాత్మీయులే
మోసానన్ తమకాహుతిన్ గొనిరె బాపూ విశ్వవైతాళికా ?

"నిన్ను జగత్పితన్ - భరతనేతను - సత్యదయాలవాలు - త్యా
గోన్నతమూర్తి - ధర్మనిలయున్ - నరహంతలు స్వార్థులై మతం
బన్న మిషన్ కృతఘ్నతను హత్యయొనర్చిరి చేతులారగా"
నన్న విషాదవార్త పిడుగై కలచెన్ జగమున్ సమస్తమున్

హారతులిచ్చి తామొక మహాత్మునిగా కొనియాడి అంతటన్,
తీరక దేవుడేయని నుతించుచు బ్రహ్మరథమ్ముపట్టి, నన్
దారుణ హత్యకున్ గురియొనర్చిరి నాదు సహోదరుల్ దగా
కోరులు నీతిబాహ్యులను కోకుము మమ్ము మతప్రవక్తలన్

పోసిన పాలుత్రాగి విసమున్ వెలిగ్రక్కు కఠోరతక్ష కా
గ్రేసర మీజగమ్ము చెలరేగి తుదిన్ నినుగూడ పొంచి కా
టేసినదా దయాబ్ధి ! ఇక ఈ భరతావని స్వీయజీవితా
శ్వాసములో లిఖించుకొన సాగునటే తనదుశ్చరిత్రమున్

హృదయ విదారకమ్ము భవదీయ హఠాన్మరణ మ్మసహ్యమై
కదిపిన దీ చరాచర జగత్తు సమస్తము - నీ ప్రభావ మం
దొదిగిన హింస పెల్లుబికి ఒక్క పరిన్ కబళించె మానవా
భ్యుదయమునెల్ల - ఇంక భరతోర్వర కాత్మశమించునా ప్రభూ !

పొంగితి నిన్నమొన్ననె విముక్తుడనైతి స్వరాజ్యమున్ లభిం
చెంగద అన్న సంబరముచే - ఇపు డాయువుతీరిపోయె మా
బంగరు బాపుజీ కనిన ప్రాణము లుక్కిరి బిక్కిరై వ్యథన్
క్రుంగితి - నేడు న న్నలముకొన్నవి ఆరని దుఃఖపున్ సెగల్

అమరుడనైతి నేనని మహాత్మ ! స్వతంత్ర దినోత్సవమ్ములో
భ్రమసి రచించుకొంటి మధురమ్ములు పద్యము - లవ్వి నే డబ
ద్ధములని తేలిపోయె - నిను దారుణహత్య యొనర్చుకొన్న నే
నమరుడనా ? నిశాచరుడనా ? వివరింపు ముదారజీవనా !

"శ్రీ"యని నవ్యభారతచరిత్ర సువర్ణమయాక్షరాలతో
వ్రాయగ నుత్సహించునెడ ప్రప్రథమమ్ముననే అమంగళం
బాయె మతమ్ముపేర నరహంతలు సల్పిన ఘోరహత్యతో
వ్రాయకయే సమాప్తిగనె బాపు ! భవన్మరణప్రసక్తితో !

   

# అహింసా జ్యోతి

నీబోసినవ్వులో నిత్యమ్ము కన్పట్టు
మానవాదరణంబు మరచిపోవంగలమె !

నీకన్నుమోడ్పులో నిత్యమ్ము జూపట్టు
మాధురీప్రేమలు మరచిపోవంగలమె !

నీచేతి "గీత" లో నిరతంబు విన్పించు
మహనీయభావాలు మరచిపోవంగలమె !

నీప్రార్థనమ్ములో నిరతంబు బోధించు
మతసామరస్యమ్ము మరచిపోవంగలమె !

డి. కామేశ్వరీదేవి

అతని కరుణార్ద్ర హృదయాన ప్రతిఫలించె
దీనవేదనామయ పరిమ్లానముఖము
అతని అరమోడ్పుగందోయి యందుచిందె
పల్లెపట్టుల స్వాతంత్ర్యభాగ్యలక్ష్మి

పి. యస్. పి. దీక్షితులు

బాలురము మేము నీకు జేజేలటంచు
ఎంతయో మోదమున కేకలిడుచునుండ
బోసినోటితో నవ్వులు పులకరింప
ఆదరించెడి బాపుజీ అరిగినావె

దొడ్లేటి సత్యనారాయణరావు

## అహింసా జ్యోతి

భరతఖండ ప్రజాసారథి
భారతీ ప్రతిభా స్వరూపుఁడు
భారతీ యానర్ఘ మణి మము
బాసి పోయెఁగదా!

దేశమంతయు దిక్కు తెలియక
వెలుతురుండియు చీఁకటయ్యెను
ప్రకృతి సర్వము డీలువడి ని
స్తబ్ధమై పోయెన్

సతమహింసా సాధనకునై
జన్మమంతయు ధారపోసియు
నకట! హింసాకాండ క్రౌర్యత
నసువు లర్పించెన్

హృదయ భేదక ఘోర మృతి కా
దది మహా సుపవిత్ర యజ్ఞము
ప్రజల శాంతి క్షేమములకై
బలి సమర్పణము

కొమరవోలు నాగభూషణరావు

# అహింసా జ్యోతి

ఈయద్యాలలో సాగుచున్న ముద్దుల పిట్ట
లేచి కెవ్వున కేకవైచెనేమి !
పాకలో లేగకు పాలిచ్చు గోవు "అం
భా" యంచు గొంతెత్తి యరచెనేమి!
జలజల ప్రవహించు జమున నిస్తబ్ధయై
నిలిచి కన్నుల నీరునింపునేమి !
చకచక పొలము దున్నుకొని పోయెడి
రైతునాగలి ముందుకు సాగదేమి !

కోటలో ఆరుగంటలు కొట్టబోవు
వాని హస్తాలు గడగడ వడకునేమి !
ఏ మహాత్ముని గుండెపై నెక్కి చనెనొ
కాలపురుషుని రథ రథాంగములు నేడు

ఇదియేమి! నిజమా - మహాత్ముడిక లేనేలేడ - ఈవార్త ప
ట్టిది కాదా - కరుణాసముద్రుడగు తండ్రిని హత్యగావించిరా?
ఇదియేమి- ఇదియేమి - ఏమిటిది-స్వామీ! ఈవిషంబేమి? మ్రిం
గుదుమా - మ్రింగకతప్పదా - జగము గగ్గోలెత్తి వాపోయెడిని !

జంధ్యాల పాపయ్యశాస్త్రి

# అహింసా జ్యోతి

నిండుమనస్వి విశ్రుతవినీతపునీతయశస్వి - సాత్త్వికా
ఖండతపస్వి సత్యసహకారము చిట్టచివారుకొమ్మపై
పండినపండు - బ్రహ్మఋషి - భారతభాగ్యవిధాత - ప్రార్థనా
మండపవేదిమీద నిక మాకనుదోయికి విందొనర్చడా!

హింస అహింసపై పగవహించె - నవోదయశక్తిమీద వి
ధ్వంసకశక్తి దూకిన - దధర్మము ధర్మము నాక్రమించె దు
ర్మాంస బుభుక్షు రాక్షస కరమ్ము ప్రశాంత మరుత్తరంగిణీ
హంసము నేసె సంధ్యసమయమ్మున విశ్వము విహ్వలింపగన్

గుండెలు జారిపోయె ప్రజకున్ - కనుగోనల నశ్రువాహినుల్
నిండె - నభమ్ము బ్రద్దలయి నెత్తిపయిన్ బడె — దద్దరిల్లి బ్ర
హ్మాండము క్రుంగిపోయినది - అంతటి తండ్రిని ధూర్తుడైన పు
త్రుండు కిరాతహస్తములతో వధియించె నటన్న వార్తకున్

క్రొత్త వెలుంగు బాట నెటకో గొనివచ్చి "స్వతంత్ర భారతో
దాత్త నిదర్శనం" బగు ప్రదర్శనమంచు మహాభయంకరో
న్మత్త పిశాచినీ వికటనాట్యము చూపితివేమి? ఈ కథా
వృత్తము జూడలేము తెరవేయుము దీపము లార్పుమో ప్రభూ!

* * * *

# అహింసా జ్యోతి

ఏమయ్యా! మహాకాలేశ్వరుడ! నీ వెన్నాళ్ళనోయుండి ఈ
సీమాంతమ్మున నిల్చి చూతువుగదా శీర్షమ్ము పైకెత్తి, క్షి
తిమధ్యమ్మున ఎచ్చటేని – ఎపుడేనిన్ – "బాపుజీ" వంటి ని
ష్కామప్రేమతపస్వి పుట్టెనె? అహింసాదివ్యతేజస్వియై

ఎత్తిన కత్తి కాత్తు బలియిచ్చెడి మేకల పాలు ద్రావు నీ
మెత్తని చిత్తమందు కుసుమించిన తమ్మిని సన్నజాజి పూ
గుత్తి పరీమళమ్ము లనుకొందురు సత్య మహింస – నేడు నీ
పెత్తిగలేక మహాత్మ! భరతోర్విని వానికి దిక్కు గల్గునే!!

"యుగపురుషుండ"వంచు – 'పురుషోత్తమమూర్తి'వటంచు – మూర్తిమ
మజ్జనానురాగ శాంతిమయ సాత్త్వికశక్తి" వటంచు – వేనవేల
యుగముల ప్రస్తుతించెను ప్రమోదముతో జగమెల్ల నిన్ను, ఏ
మనుజుడు నీకు తొల్లిటి మహమ్మదు క్రీస్తును బుద్ధదేవుడున్?

ఏలోకమ్ముల ఎందునుండినను గాని – చల్లనైనట్టి ని
యాలోకంబుల మాపయిన్ బరపుమన్నా! అన్నదమ్ముల్ వలెన్
మాతోనేము విభేదముల్ మరచి ప్రేమస్నిగ్ధ జాతీయ పం
థాలన్ ముందుకు సాగిపోయెద మహింసాజ్యోతి క్రీనీడలన్!

★ ★ ★ ★

జాజి గులాబులు సంపెగలుంగావు
శాంత్యహింసాది పుష్పములు వలయు
పసిడిపళ్ రతనాల పలక నిల్పుటగాదు
నిరతంబు హృత్ప్రీతి నిలుపవలయు
అగరు సాంబ్రాణుల పొగలువేయుటగాదు
సద్వాసనామైత్రి జరుపవలయు
తనివిగా ఫల నివేదనము సేయుటగాదు
తెంపు ధైర్యము నివేదింపవలయు
మహి మహాత్ముని పూజసామగ్రి యిట్టి
లనుచు దెలియుడు ప్రజావార! యనవరతము
నెల్ల కథలను జూపించు నెత్తుగలుగు
దివ్యకీర్తియు యుగయుగమ్ము దేశమ్ము.